శ్రీ ర స్తు.

# శకుంతలాపరిణయము.

కృ ష్ణ క వి ప్ర ణీ త ము.



చె న్న పు రి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్వారిచేఁ

ప్ర క టి త ము.

1927.



శ్రీరస్తు.

# శకుంతలాపరిణయము.

## పీఠిక.



శా. శ్రీవత్సాంకలసద్భుజాంతరయుత స్వీయోరుహారాగ్రరే
ఖావిక్రాంతి దెసంగుతత్కుచతటిన్ గైసేయుఁ గాశ్మీరసం
భావంబుల్ తనమైఁ బొసంగ నలమేల్మంగాభిధానేందిరా
దేవిం గౌఁగిటఁ జేర్చు వేంకటపతిన్ ధీయుక్తిఁ గీర్తించెదన్. 1

ఉ. ధీనిరవద్య హృద్యనిరతిన్ హరితో భరితోత్సవంబులన్
బూను కడానిబొమ్మ కలుముల్ వెలుముల్గలముద్దుగుమ్మ స
న్మానిమనోపహారిణి రమారమణీమణి భూరిసూరిస
న్మానముఁ గూర్చుఁగాత సిరిమన్ దెలిమంజుల మైనమత్కృతిన్. 2

ఉ. పుంఖితశత్రుకర్ణములు భూరివిరోధిశిరోధులుం జవ
ప్రేంఖదరాతిమస్తములు విద్విడురంబులు నంగదావళీ
రింఖదరిప్రవేష్టములు శ్రీలఁగ లీల దెసంగుదైత్యభి
చ్ఛంఖముఁ జక్రమున్ గదయుం శార్ఙ్గము ఖడ్గము మమ్ముఁ బ్రోవుతన్. 3

క. భాసురసూరిగ్రామణి, భూసురముఖపంకరుహనభోమణి వినమ
ద్దాసనిచయచింతామణి, నే సింగరిగురుశిఖామణిం గణుతింతున్. 4

తే. సోము నన్నయఁ దిక్కనసోమయాజి, భీము శ్రీనాథు భాస్కరుఁ బెద్దనార్యుఁ
బోతనామాత్యు మఱియును బొలుపుఁగాంచు,నాంధ్రకవితానికాంతుల నభినుతింతు.

ఉ. శ్రీరమణీధవార్పితము సేయుకృతిన్ బ్రతికూలవృత్తిపై
క్రూరవచోవికారములఁ గుందగ నెట్టని చూడ్కిఁ జూడి వే
పారుచు సారె దూఱుచుఁ గుశంకలఁ బోవకుఁ డన్నలార! మీ
నేరుపు లవ్యకావ్యసరణిన్ బరణింపఁగఁ జేయు టొప్పగున్. 6

వ. అని యివ్విధంబున నిష్టదేవతాప్రార్థనంబును గురువందనంబును సుకవిభూషణం
బునుం గుకవిదూషణంబునుం గావించి యొద్దియేనియు నొక్క ప్రబంధంబు రచి
యించి మదిష్టదైవతంబునకు నంకితంబు గావింపం దలంచునవసరంబున. 7

సీ. ఏమహాత్ములపుట్టినిల్లు బ్రహ్మాదులుఁ శిరసావహించి పూజింతు రెలమి
నే దయాహృదయుల సైదోడుజగములఁ ద్రిస్రోతయై పవిత్రీకరించు
నెవ్వారికుత్ప్రాప నేకొఱంతయుం లేక వసుధాసుధాశనవ్రతము లెసఁగు
నేమహామహులసంగ్రామసామర్థ్యంబు పార్థివోత్తములకుఁ బట్టుఁ గొమ్మ
తే. వారు దుర్వారగర్వారవముఖరముఖ, శత్రుజత్రుక్షతిక్షరత్క్షతజకృతజ
యార్ద్రచర్మాసమర్చితోగ్రాసిలసన, భాసురభుజోర్థవిభవులు పాదభవులు. 8

ఆ. ఆపాదభవులలోపల, నాపాదితధైర్యధుర్యు లార్యు లవార్యుల్
ప్రాపితధనకనకాంబర, గోపాయితకవులు పైఁడికులగోత్రభవుల్. 9

క. ఆరసికులలోఁ బెద్దన, గారనఁగా రూఢదీపకళికాకలస
ద్ధోరణి సిద్ధారణిఁ దగు, కారుణికులలోనఁ బరమకారుణికుం డై. 10

క. పెద్దనగారా వేలుపుఁ, బెద్ద నగారాతిభాతి భృతవైభవుఁడై
పెద్దనఁగా రాశూరుల, పెద్దనఁగారాచ మెచ్చుబిరుదముఁ దెచ్చెన్. 11

ఉ. సన్నుతకృష్ణరాయనృపసత్తముచిత్తము రాఁ జరించుచున్
మన్నన మీఱి భూరిబహుమానముగా గజరాజరాజిఁ గై
కొన్నఘనుండు పైఁడికులగోత్రపవిత్రచరిత్రుఁ డౌర పె
ద్దన్నసిరుల్ సరుల్ పొగడ నక్కడ నిక్కడ నెక్కుడై తగున్. 12

సీ. మహిమ నేటూరియిమ్మడి తిర్మలకుమార సింగరార్యుల ప్రియశిష్యుఁ డగుచు
నాచార్యపదభక్తి యాశ్రితావనరక్తి గలిగికార్యాదార్యకలితుఁ డగుచు
రాయలరాజకార్యమునందు నిరతుఁడై ప్రాజ్యసామ్రాజ్యసంభరితుఁ డగుచు
ధనధాన్యకటకమై తనయిల్లు వర్ధిల్ల ధాత్రీసురత్రాణదక్షుఁ డగుచు
తే. నవనితవణించె రవణిహృద్యానవద్య, పద్యగద్యావళీస్తవ్యభవ్యనవ్య
కావ్యసంభావ్యభీమసంగ్రామవిజయ, బిరుదుఁ దగు చిఱుమామిళ్ల పెద్దశౌరి. 13

ఉ. మానితమూర్తియైన చిఱుమామిళపెద్దనృపాలమౌళికిన్
సూనుఁ డొరుంగు గల్గె మధుసూదన పాదసత్క్రియాపరుం
డానతశత్రుజాలుఁడు నయానయనిర్ణయశీలుఁ డుత్తమ
జ్ఞానఘనుండు తిమ్మనృపసత్తముఁ డుత్తముఁ డిమ్మహిన్ రహిన్. 14

పంచచామరము. ధరాధరాధరాహి·పర్యధైర్యధుర్యపీట్కర
స్ఫురత్తళత్తళత్ప్రభాప్రభూత శాతహేతిచే

విరోధిరాట్ఛిరోధిరాజ శ్రీలహోబిలస్వామి
స్థిరామరామరాగుఁడైన తిమ్మభూవిభుం డనిన్. 15

తే. తిమ్మనృపతికిఁ బట్టపుదేవివలన, సుచిరాకారు లిరువురు సుతులు గలిగి
రగ్రజుఁడు వేంకటాద్రీంద్రుఁ డవరజుండు, భవ్యగుణశాలి రామభూపాలమౌళి.

సీ. బలరామ రఘురామ పరశురాములతోడ విక్రమంబున మాద్రి వేంకటాద్రి
ద్విజరాజ ఫణిరాజ దిగిభరాజులతోడ విశదకీర్తులమాద్రి వేంకటాద్రి
యినజాత వనజాత ఘనజాతములతోడ వితరణంబున మాద్రి వేంకటాద్రి
భారతీశ సతీశ భార్గవీశులతోడ విన్నాణమున మాద్రి వేంకటాద్రి

తే. ధారుణి భరించి బుధుల గారవించి, సురుచిరసువర్ణపూర్ణత సొబగుమించి
యగణితోచ్ఛ్రాయమున దివమాక్రమించి, వలయు హేమాద్రితో మాద్రి వేంకటాద్రి.

సీ. దినదిన దీనాళిరక్షణంబున కన్నపూర్ణాదేవి కన్నపూర్ణ
నిత్యసత్యవ్రతనిష్ఠాగరిష్ఠత కన్నపూర్ణాదేవి కన్నపూర్ణ
సౌశీల్య వాత్సల్య సాకల్యకల్యత కన్నపూర్ణాదేవి కన్నపూర్ణ
సౌందర్యగాంభీర్యచాతుర్యధుర్యత కన్నపూర్ణాదేవి కన్నపూర్ణ

తే. పరికపుల వేలుపులగిడ్డి వాసిరిద్ధి, పద్మనాభునితోఁ బుట్టువడఁతి యగుట
కన్నపూర్ణమహాదేవి కన్నపూర్ణ, మహితసద్గుణనికురుంబ మాచమాంబ. 18

క. ఆమాచమాంబవలనఁ బ్ర, ధామహితుఁడు వేంకటాద్రితనయుం గనియెన్
సోమవరస్తోమ శర, వ్యోమసరిద్ధామకీర్తి నూర్జితమూర్తిన్. 19

క. వేంకటనాథుం డొసఁగిన, సంకల్పఫలం బటంచు జననీజనకుల్
వేంకటపతినామంబున, నంకితముఁ గావించి రతని నాశ్రితరతునిన్. 20

క. శంకాతంకానంకా, హంకారస్ఫారశౌర్యహార్యత్వుండై
వేంకటపతి ధృతిమీరఁగ, వేంకటపతి యనఁగ జగతి వినుతికి నెక్కెన్. 21

క. ఆవేంకటపతినరపతి, దేవి రహిం బాపమాంబ దినదినమూర్త్యా
దేవిని శ్రీదేవిని వా, గ్దేవినిఁ బోలించు వసుమతిఁ సుమతియనన్. 22

ఉ. నేరుపుమీఱఁ బుట్టినిలు నీరును రాలును గాఁగఁ బుట్టిరా
మారునిఁ గన్న తల్లియును గుమారునితల్లియుఁ బోటివత్తురే
భూరతరవ్రతాచరణఁ బుట్టినయింటికి భవ్యకీర్తియున్
బౌరుషమున్ దనర్చి ధరపై నొఱపైతగు బాపమాంబకున్. 23

చ. పటుగతిఁ బాపమాంబకును బ్రాభవవైభవశాలియైన వేం
కటపతికిన్ దనూభవులు గల్గిరి నల్వురు విక్రమక్రమో
త్కటరిపుహారి జగ్గనరపాలుఁడు రామధరావరుండు మా
రట మదనుండు పెద్దశివరామ మహీపతి వేంకటాఖ్యుఁడున్. 24

శా. ఆ వెంకక్షితిపాలసోదరుఁడు రామాధీశ్వరుం డుల్లస
ల్లావణ్యంబునఁ గావ్యనాటకగుణాలంకారపారీణతా
ప్రావీణ్యంబున వాక్పటుత్వమున సద్భావంబునన్ విక్రమ
శ్రీవైయాత్యమునన్ బ్రసిద్ధిఁ దగుచున్ జెల్వారు నిద్ధారుణిన్. 48

సీ. తమ్ములయెడలనెయ్యమ్ముసూపఁడుగాని రాజు కాంతులసాటిరాకయున్నె
యిచ్చుచో గొణఁగి పెల్లగురకుండఁడుగాని రసద మీగికిసాటిరాకయున్నె
సశరీరుఁడగుచు సాక్షాత్కరింపఁడుగాని రతిరాజు రహిసాటిరాకయున్నె
కువలయామోదంబుఁ గూర్పఁజాలఁడుగాని రవి తేజమునసాటిరాకయున్నె

తే. యాదరస్మితవదనునకీవదాన్య, మౌళికీరూపశాలికీమానితప్ర
తాపునకునంచుబుధులుచిత్తములనెన్నఁ, బ్రబలు పెదశివరామన్న రామశౌరి. 49

సీ. ప్రథమాంశమునధర్మభంగముంకువగాఁగ, బాణిగ్రహణమైనపలుచఁదనము
రాఁగూడదని పల్కురమణు వెంబడినేగి కానలోవిహరించుగడుసుఁదనము
మాయామృగము వెంట మగఁడుపోవఁగ దంట మఱఁదినంపిననాటిమంకుతనము
రావణాసురుపీట రహిఁబాసి నానాట చెఱసాలనెలకొన్న చిన్నతనము

తే హవణిఁదీర్పఁగఁగ్రమ్మఱనవతరించి, పైఁడికులగోత్రమిద్ధాత్రిపాత్రముగను
జెలఁగురామక్షమాపాలుఁ జెట్టపట్టె, ధీరకోరణిజానకీదేవి. 50

తే. తీవిఁదనరారుజానకీదేవివలన, రామభూపాలతిలకుండు ప్రేమమీఱఁ
బడసెముర్వురఁ దనయులభరితనయుల, హరిహరాబ్జభవాంశములనువారి. 51

క. వెంకక్షితిపతియనఁగా, ర్యాంకుఁడులక్ష్మన్నయవనిజాశ్రితకువలై
గాంకుఁడు సీతప్రభుఁడన, నంకితనామములవిజయమందిరిధరణిన్. 52

చ. సలలితభాగ్యచిహ్నముల సన్నుతికెక్కుడుచిన్నమాంబికా
జలరుహపాణితోడసుఖసంతతిఁగాంచుచుభూరివైభవం
బులఁ దనరారి సూరిజనముల్ జనముఖ్యుఁ డటంచు నెంచఁగా
విలసిలురామభూవరునివెంకనృపాలుఁ డలోలుశీలుఁడై. 53

మ. చిరుమామిళ్లకులాబ్ధిచంద్రుఁడు జయశ్రీసాంద్రుఁడచ్చన్నభూ
వరుఁడున్ వెల్లనుసాఁదనర్చుతరుణిం బాణిగ్రహంబై శుభ
స్ఫురణన్ సంతతిఁ గాంచి విప్రతతికిన్ భూగోహిరణ్యాదిభా
స్వరదానంబులఁ దృప్తిచేసి తనరెన్ సభ్యుల్ ప్రశంసింపఁగన్. 54

శా. ఆరామప్రభుసీతభూతలవిభుం డశ్రాంతవిశ్రాణన
స్వైరంబైనసురద్రుపంచకము గెల్వం బంచశాఖావ్యయో
దారంబైనిజహస్తవారిరుహమిద్ధాత్రీసురశ్రేణికిన్.
హారాళంబుగఁ గోర్కులీనఁదనరున్ హేమాద్రితో మాద్రియై. 55

సీ. కులగోత్రముల కాదికొన్న చిన్నతనంబు వినయములో నుదయించుకసరుఁదనము
పుడమి నంతకనామమునఁ జేర్చువైళంబు రేలు వెలారించు జేలతనము
కాఁపురం బప్పులగడపుకోఁచఁదనంబు నిఁచినచోట కాల్పులనిగోనము
మేనిమచ్చల నిచ్చలూని విన్నఁదనంబు గళమున గరముఁగా గడుసుఁదనము
తే. మానవిగ్రాజదాసవశ్యానరూఢ, రూఢగుణగణవిభ్రమారూఢగాఢ
వైభవస్ఫూర్తిమస్ఫూర్తి వసుధ బరఁగె, సరసుఁడైన సీతారామధరణివిభుఁడు. 56
క. కవికిన్ వేంకటలక్ష్మీ, దేవీమణివలన సంతతిం గాంచుచు వి
ద్యావైదుష్యంబునను, ద్భావంబున సీతన్నపతి ప్రబలున్ ధరణిన్ 57
క. ఆ రామప్రభునకు జుం, డైరాజిలులక్ష్మణేంద్రుయశము మిల వెలసెన్
దారాచలతారాధిప, తారాచయతారహారతారాభంబై. 58
క. ఆలక్ష్మీపతి నరపతి, వైలమ్మునజానకమ్మ వలననిరువురం
బాలురఁ గాంచెం బృథ్వీ, పాలురఁ గా నాయఁడమ్మ పాపయ్యయనన్. 59
క. ఆనాయఁడమ్మ నెమ్మది, గానెలకొని పాపమాంబికాసహితుండై
నానాసుఖభోగమ్ముల, నానందమునొంది జగతి నభినుతిఁ గాంచెన్. 60
క. ఆనలువురు పూటస్థుల, లోనంగడిగొట్టు సుజనులోలు డు వెంక
టస్వామినాథుఁడు గోవిందాం, బారతిం గాంచె సీతయాఖ్యుం దనయున్ 61
క. ఆనలుగురుధీయులఁ దగు, నానలుగురు మీఱువిభ్రమాతిశయమునన్
ధీనిరతిజయమునం జెలు, రానసుఁడై రామభూవరాగ్రణి ధరణిన్. 62
పంచచామరము. పన్నగారివాహుఁడూహవన్ని చిన్న పాపఁడై
యన్నగారివెంటదంట యై చరించు వైఖరిన్
బన్నగారివాహవాంశభాగిరామభూవిభుం
డన్నగారివెంటదంట యైచరించు వైఖరిన్. 63
మ. అనయంబు న్వినయంబు పండితుల కత్యానందముం గూర్పహే
మనగేంద్రప్రతిమానధైర్యుఁడగు రామక్షోణిపాలుండు తా
ఘనదానంబున క్షాత్రము న్గలసి లోకస్ఫూర్తి మూర్ధభవిం
చినచోదంబునఁ దోఁచుఁ జూపఱకు సత్కీర్తి ప్రభావోన్నతిన్. 64
తే. శీలగుణవృత్తముల ధాత్రిఁ జెలగువాసి, రెడ్డిపెదపద్మనాభుపుత్రీలలామ
భాగ్యములదీవి రామభూపాలు దేవి, పతితులకు మేటి రమణమాంబావధూటి. 65
తే. రమణమాంబికవలన నారామవిభుఁడు, కనియెను మువ్వురుతనయులఁ గణితనయుల
ఘనునిఁ గోదండరామునిఁ గలిజనాథ, నయుల వేంకటరామన్న నాయఁడముల. 66
వ. అందు. 67
క. కోదండరామజనపతి, వేదండకరప్రకాండదోర్దండసన్నిభబా

సీ. విలసదద్దంకితిరుమలతిరుమలాచార్యు నంఘ్రిపల్లవయుగం బాశ్రయించి
హరివాసరవ్రతసదాచారకలనంబు నిత్యవ్రతంబుగా నిర్వహించి
సత్తటాకవనాదిసప్తసంతానముల్ సమధికోత్సాహుఁడై సంఘటించి
హితపురోహితసమాహితసమాహితముగాఁ బురుషోహరియటంచు భూరిఁ బంచి
తే. ధనకనకవస్తువాహనధాన్యపుత్త్ర, పౌత్త్రదీర్ఘాయురారోగ్యభాగ్యమహిమ
నిండఁదనరారు మీనాక్షిదేవితోడ, మహితతేజుండు పాపయమాత్యవిభుండు. 86

వ. వెండియుఁ బ్రాద్యానవద్యపద్యగద్యోక్తకవిద్యాసముద్యమోద్యద్విద్వన్నికరసుకరాశీ
ర్వచనరచనాప్రవర్ధమానసంపత్పరంపరాపూర్ణుండును రణాగ్రవ్యగ్రనిజభుజాగ్రజా
గ్రన్మండలాగ్రప్రసారోత్సారితరిపుమండలహిండితచండమరీచిమండలుండును విరం
తరనిరంతరాయనిశ్శ్రేయసనిర్విశేషసమృద్ధసప్తసంతానపరిపూరణస్ఫురణపరిణతస
ముత్సాహదోహలుండును శ్రీవెంగమాంబికాగర్భశుక్తిముక్తాఫలుండును బైఁడికుల
గోత్రపవిత్రుండును బావనచరిత్రుండును నగు శ్రీ చిటుమామిళ్ల పాపయ్యప్రభుం
డొక్కనాఁడు పుత్త్రమిత్త్రామాత్యబంధుసందోహపరివృతుండై నిండోలగంబున
సుఖాసీనుండై సరససల్లాపంబులం బ్రొద్దు గడపుచు. 87

మ. నను రామానుజపాదపద్మయుగళీనవ్యాప్యయుధ్యానపా
వనహృద్భాగవతావతంసపదసేవాసక్తచిత్తుల్ మరు
త్తనయారాధనచారులబ్ధకవితాధారుల్ సదారూఢభా
వను సాష్టానకిల్ నిజాశ్రితునిఁ బిల్వంబంచి పల్కెన్ గృపన్. 88

క. పాత్త్రుఁడవై మైత్రేయస, గోత్రుఁడవై నారసింహగురువర్యునకున్
బుత్త్రుఁడవై వెలయుదువీ, ధాత్రిన్ మాపనుపు సేయఁ దగు కృష్ణకవీ! 89

క. అన్వయభవ్యాపహమగు, కావ్యరచన మరియు మేలు గాదే బుధసం
భావ్యము 'శివశ్రేయసే, కావ్యం' బను సూత్ర మార్యఘటితం బగుటన్. 90

వ. అదియునుం గాక యొక్క విశేషం బాకర్ణింపవలయు నొక్కనాఁటి హరివాసరవ్రతో
పవాసంబున విశ్రాంతరై యున్న మజ్జననిచరణారవిందంబులకుం బ్రణమిల్లి కృతాం
జలిపుటుండనై యున్న నన్నుం జూచి వత్సా! సప్తసంతానంబులయందుఁ గృతిం బడ
యుట విశేషలాభంబనియు మహారాజన్యచరిత్రంబు కలిదోషనాశకంబనియు నాము
ష్మికఫలప్రదంబనియుం బెద్దలు నిర్దేశింతు రట్లగుటం జేసి యొద్దియేనియు నొక్క రా
జన్యచరిత్రంబు కృతిముఖంబుగా రచియింపం జేసి వేంకటేశ్వరార్పణంబుగా నివేదిం
పందగు నిది మదీప్సితంబని యాదేశించుటయు నయ్యమ సెయ్యంబునకుం బ్రీతుండనై

జనన్యాభిజ్ఞానవర్తనంబు సలుపం బూనియున్న నాకు భవత్సన్నిధానంబునం దొర
కొనియెం గావున. 91

క. కృతికన్యాపతి వేంకట, పతి యట కృతిభారతార్థపద్ధతి యట యా
కృతి భవనిష్కృతియగు నట, కృతివిగదా నీవు జగతిఁ గృష్ణకవీంద్రా! 92

వ. అని యిట్లు విధంబునం బ్రశంసించి తాంబూలస్వర్ణాంబరాభరణంబులం బహుమానంబు
గావించిన నేనును బ్రహృష్టాంతఃకరణుండనై మత్కృతిపతి యగు శ్రీవేంకటా
చలపతి నభివర్ణించెద. 93

సీ. ఏ దేవదేవు నిసాదరాలోకంబు లోకంబులకు సౌఖ్యమాపాదించు
నే పరాత్పరు దివ్యరూపానుభావంబు భావంబులకు మేలు పాదుకొలుపు
నే జగజ్జనకు నిరిచ్ఛావిహారంబు హారంబు ధారిణీచారుముఖికి
నే మహాబలశాలి హేలావతారంబు తారంబుఁ ష్టపత్రయమునకును
గీ. నేసుధీనిధిఁ గిరాతకప్రభృతి సుఖాంతు, రంగ బంగాళ చోళ కళింగ వంగ
గౌళ పాంచాల నేపాళ మాళవాంధ్ర, శకయవనముఖ్య దేశముఖ్య నృపులు. 94

శా. ఆపన్నాళిపు వేలుపుం దొరఁ బ్రపన్నానీకమున్ గొల్వఁ గా
శ్రీవైకుంఠపురంబు వెల్వడి ప్రసచ్ఛృంగారుఁడై యుండిరా
జేంద్రోపస్కృని స్వామిపుష్కరిణికాతీరప్రదేశంబునన్
భావింపందగు హేమసౌధమున శుంభల్లీలఁ గ్రీడించుచున్. 95

సీ. ఆమోదమున నామ రామాకళామంబు మెఱుఁగారు నెమ్ముపై మెఱపు లీన
సహితలోకైకదుస్సహసహస్రారంబు లాలితంబగుచుఁ గెంగేలనమర
ఘనతరామలకనత్కనకోత్తరాసంగ దీధితియొడలు పైఁ దేజరిల్ల
ఘూర్ణద్గిరికచారుహీరకోటీరంబు కోమరారుచున్నత్తమాంగమునఁ బొసఁగ
గీ. లలితధాతువిచిత్రశిలావిశేష, శేషగిరిశృంగశృంగారచితసిరాంత
బహుళమణిరాజరాజితభద్రపీఠి, సరసగతి వేంకటాచలస్వామి వెలయు. 96

## షష్ఠ్యంతములు

క. ఏవంగుణగణభృతికిన్, గేవలవిద్యాభిరతికిఁ గల్పితహృతికిన్
భావభవాకృతికిన్ విజ, యావహపరిణతికి వేంకటాచలపతికిన్. 97

క. శంకృతికిన్ చితదైత్యా, హంకృతికిన్ మణిగణోజ్జ్వలాభరణకృతా
లంకృతికి రణజయోన్నత, ఝాంకృతికిన్ మదనసదృశభవ్యాకృతికిన్. 98

క. శరవరశరదంబునకున్, తరుణసరసిజసనిత్సుధాకరకరస
త్ఫురహారగిరిశిచక్ర, చరదురుతరతరుణకీర్తిశాతోదరికిన్. 99

క. శ్రీలలనకుఘనఘనాఘన, నీలనకవనీవనీవనీపకరక్షా
శీలునకు నబ్ధికన్యా, ఖేలనలోలునకు శేషగిరిపాలునకున్. 100

క. ఖరకరకరగరవైశ్వా, నరనగహారిహారిఖరారినవశౌర్యకలా
భరణునకున్ సకలకలా, ధరణునకున్ శేషశైలపరవరణునకున్. 101

వ. అంకితంబుగా నాయొనర్పంబూనినశకుంతలాపరిణయం బనుమహాప్రబంధంబునకుం
గథాక్రమం బెట్టిదనిన. 102



శ్రీరస్తు.

# ప్రథమాశ్వాసము.

## కథాప్రారంభము.

తే. తాలహింతాలతూలదిసాలసాల, మాలకతమాలకృతమాలమాలతీల
తాలతాళీగళద్రజస్థగితగగన, రామణీయంబు నైమిశారణ్యపదము. 1

క. ఆనైమిశవనభూమిని, శౌనకశాండిల్యముఖ్యసంయమివర్యుల్
పూనిసుఖంబునసూతుని, మానితగుణజాతుఁ జూచి మది ముద మొదవన్. 2

వ. భారతకథాసుధారసంబు వీనుల నించుచు మమ్ముఁ గృతార్థులం గావించితి వందు శకుంతలాదుష్యంతోపాఖ్యానంబు సవిస్తరంబుగా వినవలయుం జెప్పు మనిన సూతుండు పరమహర్షసమేతుండై శౌనకాదిమహామునులకుం జెప్పె నట్లు వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె. 3

మ. కలదుర్విన్ బలగర్వితాహితకచగ్రాహగ్రహోద్యద్భుజా
ర్గళరాజద్ద్విజరాజగోత్రశిఖరద్రాజన్యసౌజన్యపు
ష్కలసద్వస్తుసమస్తహస్తినగరాఖ్యప్రఖ్యరాజన్వతీ
తిలకం బంగకళింగవంగముఖదిగ్దేశాధిపాశాస్యమై. 4

సీ. గురుఁడైన భారతీవరుఁడైన నోడించు విద్వత్ప్రవరులైన విప్రవరులు
హరుఁడైన దంభోళిధరుఁడైన దమకించు రాజన్యమణులైన రాజమణులు
ఘనుఁడైన మరువాహనుఁడైనఁ దలఁకించు నార్యాభిజనులైన యర్యజనులు
హరియైన గంగాలహరియైన విహసించు బాహావిభవులైన పాదభవులు

గీ. వేదవిద్యాప్రభావభావితవితరణ, పరిణతయశఃప్రసారవిస్ఫారులగుచు
నలువుమీఱుదు రగ్రవర్ణములధీరు,లా జవంజవధారులా రాజధాని. 5

ఉ. నందితసూనృతరత్నవరణప్రతివాసరచంద్రచంద్రికా
కందళదిందుకాంతఫలకస్రుతపాండురవారిపూరముల్
చెందఁగనందమై పరిఖ చెన్నెసఁగున్ శశివంశరాజసం
క్రందనులున్న తన్నగరిఁ గాచుసుధాజలరాశికైవడిన్. 6

మ. స్ఫురదాకాశతరంగిణీమధురవారిపూర్ణంబు ద్రావంగఁ గాఁ
గరమభ్రమ్మున కెత్తి హత్తినమహాగంభీరభ రాజం బనన్

హరినీలద్యుతిత్ప్రవప్రవలయంబై యున్న తద్వారగో
పురమై మహాస్థిపురంబు పేరునకుఁ బెంపుం గూర్చు నశ్రాంతమున్. 7

సీ. మాపట్టునొకవీథి సుకుమారతరపద క్రమణమాతంగచంగములగములు
కనుపట్టునొకవీథి ఘణఘణక్వణరణ ద్ఘంటికాశతశతాంగములగములు
పసిమీఱునొకవీథిఁ జక్రచంక్రమణాది గమనదుర్గమతురంగములగములు
మొనసూపునొకవీథి ఘనఘనజార్గళచిర గ్గళవాహినీపురోగములగములు
గీ. తిరునొకవీథి బధిరితదిగిభరాజ, కర్ణకోటరపాటనక్రమసమగ్ర
పటహడిండిమభేరికాహళవమర్ద, శప్రముఖవాద్యవాద్యకోలాహలములు. 8

సీ. ప్రసవాసవాసంగలసమానమదభృంగ విసరైకశృంగారరసలవంగ
మనుభూతఫలసారఘనశుకవ్రజభార వినమితఫలపూరవిటపివార
మతనుకేళీవిలోలసుతపల్లవజాల కృతనివాసతమాలతతవిశాల
మతులకోకిలపోతధుతపల్లవవ్రాత నతలతాసంఘాతవితతచూత
గీ. మానమితచంచులనకాలీనకలహ, కలితకలకలకలరవకులకులాయ
రంగదుత్తుంగతుంగసారంగరంగ, మలరునక్కవరపురసరోద్యానవనము. 9

సీ. కులుకుగుబ్బెతగబ్బిగుబ్బపాలిండ్లపై వలపులీనుజవాది మెలఁగిమెలఁగి
యలసౌధములవన్నియలమద్దియలజాది యలరు శయ్యలఁ జేరి యలరియలరి
బెరసిపుష్పాడిగ్రమ్ముపెరటిలేమరువంపుఁ దరులమందిరులపైఁ బొరఁపొరలి
మరుకేళినలయుకోమలికపోలములపైఁ బునుఁగుఁజెమ్మటలతోఁ బొదలిపొదలి
గీ. సరసపరిసరకాసారసారసార, సవిసరసరణిపరితప్రసరిణభరిత
పరిణతపరాగపరిమళపవనడింభ, మోజ నలగించమించునారాజధాని. 10

ఉ. కుంతలకేరళద్రవిళకోసలసింహళగౌళమాళవా
శ్మంతకరూశఘూర్జరదశార్ణకళింగశకాదిమేదినీ
కాంతకిరీటరత్నఫలకప్రతిబింబితపాదుఁడైన దు
ష్యంతుఁడు తండ్రి తాతలక్రియన్ ధృతినప్పురమేలు ధీరుఁడై. 11

సీ. ఏరాజుభేరికాఘూర్ణితిఘోషంబు ఘోషంబమరఁ జేయుఁగుటిల నృపుల
కేరమ్యగుణశాలిభూరిప్రతాపంబు తాపంబుగూర్చు నధర్మరతుల
కేమేటినిజభుజాధృతచంద్రహాసంబు హాసంబుగావించునహితధార
కేధన్యువితరణసాధుసంకల్పంబు కల్పంబునకు వెలి కాంతినెఱపు
గీ. నతఁడు కేవలనృపుఁడె సమ్రాట్టపాస, చకితచకితాహితాహితస్వర్ణపూర్ణ
విశ్వవిశ్వంభరాధురావిధురతరభు, జాగ్రజాగ్రద్బలుండు దుష్యంతవిభుఁడు. 12

సీ. కొదదీఱవానలుగురియుఁ బర్జన్యుండు జగతిముక్కారుసస్యములు పండు
గ్రామముల్ ధనధాన్యకటకంబులై యుండు నఱిమిధేనువులుచన్నవిసిపిండు

బ్రాహ్మణోత్తములకు బాధలు లేకుండు నిత్యోత్సవంబులు నెగడుచుండు
వంధ్యలకాత్మజావాప్తిఁ గోర్కులు నిండు తరులనెప్పుడు పండ్లు తనిగనుండు
తే. వరతమంబులఁ దామగతంపరనఁగఁ, బూలుచేరె త్తినటువలెభూప్రజలకు
నుత్తరోత్తరమభివృద్ధి యొదవుచుండు, నెలమిన ధాత్రి దుష్యంతుఁ డేలు నపుడు. 13

వ. వెండియు నమ్మహీమండలాఖండలుండు రాజ్యంబు పాలించుచు గురుజనంబుల యెడ వినయంబును సామంతులయెడ నెయ్యంబును మిత్రులయెడ మోదంబును శత్రుల యెడ భేదంబును భోరులయెడ లాలనంబును ప్రజలయెడఁ బరిపాలనంబును శిష్టుల యెడ ననుగ్రహంబును దుష్టులయెడ నిగ్రహంబును జారులయెడ నన్వేషంబును సూరులయెడ సంతోషంబును నీతిశాస్త్రంబులయెడ శ్రవణంబును సదాచారంబుల యెడఁ బ్రచరణంబును ధర్మసూక్ష్మవిశేషంబులయెడ నాభిముఖ్యంబును ధర్మేతరంబుల యెడ వైముఖ్యంబునుం గలిగి దిగ్విజయసమాపాదితోపచయము... కళతుగఘటవిహార సాకులంబు నకల్పనగరంబునం బిత్రుపైతామహం బగురాజ్యంబు పాలించుచు నొకనాఁడు మహార్ఘమణిగణకిరణచ్ఛటాకంచుకితకాంచనసమంచితస్థూణాసుందరం బగునాస్థానమందిరంబునఁ బురోహితవిద్వత్సామంతమంత్రిప్రభృతులు ఇరుగెలంకులం బలసికొలువ సింహాసనాసీనుండై పేరోలగం బుండు నవసరంబున 14

సీ. నెఱిసంజకెంజాయ నెరసు లెన్నెఱుపల్ల జడలతోఁ గరువంపునడలతోడఁ
నిపుట తియ్యనితేనె దిపురుప్రామిడకుల పలుకుతో వజ్రంపుఁజిళుకుతోడఁ
బరమభాగవతసంపదమీఱునూర్ధ్వపుండ్రములతోఁ జక్రచిహ్నములతోడ
మందానిలాఘాతకంపితన్మహతీస్వనములతో హరికీర్తనములతోడ
తే. దమతులఁదీర్చు నుత్తమజ్ఞానఘనుఁడు, ధర్మశాస్త్రాదిసిద్ధియుతస్వరుండు
లోకసంచారకాలత్రయీకథారి, నారదుఁడు వచ్చె నచటికి నారమింపు. 15

తే. దేవమునిరాక గని ధరిత్రీకళత్రుఁ, డెదురు చని భక్తిఁ బదముల కెఱఁగి రత్న
చిత్రితవరాసనమున నాసీనుఁ జేసి, యర్ఘ్యపాద్యాదిసత్కార మాచరించి. 16

వ. కుశలప్రశ్నపూర్వకంబుగా బహువిధసంభాషణావచనంబుల నమ్మహాత్మునిచిత్తం బారాధించి తదనుమతి నుచితపీఠంబునం గూర్చుండి కొండొకతడవు వజ్ఞదారిపలుకు లకుఁ బ్రహృష్టాంతరంగుండై యమ్మునిపతి ముఖకమలంబునం జూచి కి నిపుడు సవిన యంబుగా నిట్లనియె. 17

ఆ. ఎచటనుండి మీర లిటకు విచ్చేసితి, రేమికతము చెప్పవే మహాత్మ!
మిమ్ముఁ జూడఁగంటి మీదయాదృష్టిచే, నభిమతార్థలాభ మందఁగంటి. 18

వ. అనిన దరహాసితముఖుండై నారదుం డిట్లనియె. 19

మ. పురుహూతప్రముఖామరాధిపకళాపూర్ణప్రభాశాలురై
నరనాథుం డుదయించునట్టిఘను సన్మానంబునం జూచుచోఁ

పరమార్థం బనితోఁచున ట్లగుట భూపాలాగ్రణీ! మాకు నె
వ్వరితో నేమగుధర్మవత్సలుల మై వర్తింతు మే మెల్లెడన్. 21

వ. అట్లుంగాక యింద్రాదిదిక్పాలకసందర్శనంబును గంగాదిపుణ్యతీర్థాచరణంబును గురుక్షేత్రాదిపుణ్యక్షేత్రావాసంబును గాంచ్యాదిదివ్యస్థలావలోకనంబును భవాదృశమహారాజాధిగమనంబును మాకు నవశ్యకర్తవ్యంబు లైననొకవిశేషంబుగలదాకర్ణింపుము.

సీ. శ్రీమహాదేవీలలామంబు సైదోడు వేవెలుంగుల వేఁడివెలుఁగుజోడు
యామినీకామినీకాముఁ డగు చెల్వు చిన్నారిపొన్నారిచెంకదాల్పు
కటికిచీకటులనొక్కట ప్రుంగుజగజెట్టి కలశపాథోరాశిగన్నపట్టి
మేటిదేవతలకామెత లొసంగెడుప్రోడ తొగవాలుఁగంటికిఁ దోడునీడ
తే. కడిఁది జడదారిసిగపూవు కళలప్రోవు, మెఱుపులకు సీమ కామునిమేనమామ
కన్నెవేల్పుపుటింటి భోగముల గొంది, చుక్కగమిమక్కువబోజుంగు రేవెలుంగు. 22

క. కాంచెన్ మృగలాంఛను డొరుఁ, గాంచితనయుఁ దనయుఁ బుధుఁ బదానతవిబుధున్
బ్రాంచితనుతిఁగనుసుతుఁ గని, పెంచెఁ బురూరవు బుధుండు ప్రీతిగారవుఁడై. 23

చ. ఘనతఁ బురూరవుండు దనయుం దనయున్నతిఁ గాంచె నాయువున్
ఘనుఁ డతఁ డాత్మజున్ బడసెఁ గంటి నహుషుం జయింతు నన్నృపున్
గనదనురూపరూపయుతుఁ గాంచె నహుషున్నహుషుండు గాంచె నొ
య్యన భుజశౌర్యశౌర్యదభియానియయాతి నయాతిలాలసున్. 24

వ. మఱియుం నయ్యయాతికిఁ బూరుండును బూరునకు జనమేజయుండును జనమేజయునకుఁ బ్రాచీశుండును బ్రాచీశునకు సంయాతియు సంయాతికి హాసంయాతియు హాసంయాతికి సార్వభౌముండును సార్వభౌమునకు జయుత్సేనుండును జయుత్సేనునకు సురాధీనుండును సురాధీనునకు మహాభౌముండును మహాభౌమునకు నయుతానియుతుండును నయుతానియుతునకు గ్రోధనుండును గ్రోధనునకు దేవాపియు దేవాపికి రుచికుండును రుచికునకు మతివరుండును మతివరునకుఁ ద్రసుండును ద్రసునకు నీలుండునుం గలిగిరి. యన్నీలునకు రథంతరాదేవివలన నుదయించి సోమాన్వయంబు కీర్తిపౌరుషంబుల కగ్రగణ్యంబుగా వెలయించు మహాభాగుండవ ట్లగుటం జేసి. 25

సీ. ఒకతాత కువలయాహ్లాదకరంజనంబున నఖిలలోకములరాజై తనర్చె
నొకతాత విద్యాసముద్యమాపాదియై యతిబోధమున బుధుం డనఁగ నెగడె
నొకతాత భూమిభృన్నికరశాసనమున నధికుఁడై ప్రాచీశుఁ డనఁగఁ బరఁగె
నొకతాత దినదినప్రకటదానంబున మని సార్వభౌముఁడై మహి రహించె
తే. నొకఁ డొకనికన్న మిన్నయై యున్నతంపుఁ, బెంపుగలవాత్తఁ బ్రజలను బెంచి మనిచి
ఘనుల మును గాచగించుదీవనలఁ దనరి, రదిగదా నీదుసంప్రదాయము కుమార! 26

కం. శైలంబున శైలం బిరు, గేలం గీలించి వాలిఁ గేళిగతుఁడం
దాళఁగ దెంబడి చలిఁ నే, బాలుఁడవై యాడునాఁడు బలిమికలిమి చేన్. 27

తే. వనులఁ గ్రీడించు దుష్టసత్త్వముల వలన, నాశ్రమమ్ముల నొదవెను వాశ్రమమ్ము
వెడలు మడవికి నిపుడ కాపింపు మింపు, తాపసహితా ప్తిమానుఁ బ్రతాపసహిత! 28

వ. అనుచు ధరణీవలయపరిపాలననిష్ఠాగరిష్ఠుఁ గురునృపశ్రేష్ఠులకు శాస్త్రసమ్మతం బగుట
మృగవ్యం బవశ్యకర్తవ్యంబు గావున నానావ్యాఘ్రభటపరివృతుండవై గిరితరుకంటక
శిలాదుర్గంబు లగుమార్గంబులు నిరోధించి శరభశార్దూలాదిదుష్టసత్త్వంబుల సంహ
రించి యాశ్రమంబులకు సౌఖ్యం బాపాదింపు మమ్మహామునుల యనుగ్రహం
బునం జక్రవర్తిలక్షణలక్షితుం డగు కుమారుం బడయుదవు వంశకరుం డగు నని
యాదేశించినం బ్రమోదపులకితస్వాంతుండై దుష్యంతుం డట్లు కాక యని యంగీకార
పూర్వకంబుగాఁ బ్రణమిల్లి వీడ్కొల్ప నాశీర్వచనముఖరముఖుండై యామంత్రణం
బాచరించి యంతర్ధానంబు చేసినం బ్రాంచద్విస్మయమోద మృగయావినోద
కౌతుకాయత్తచిత్తుండై యొండు నాఁ డుపసరంబున నిద్రాసుఖంబు వదలుటయును. 29

సీ. భానుఁడు పూర్వాబ్ధి బడబాగ్ని కైవడి నీల్గుచుండు నపరాబ్ధి బాడబంబో
పొడిచి రారవిఁ జేరుఁ బర్వద్యుతివసాన చెంతహాద్రి పవసిసిష్టజ్వాలనమో
ప్రతిమాధవోత్థమై ప్రబలినటుల్ సేర్చు సాక్షీలన్నహగిరో పానలంబో
ప్రాక్సపత్నిఁ గరంచ భర్తృజాబి ప్రణీతి యొయ్యయించు వేఁడి సిద్ధాధ్వగమయో
తే. తరతమంబులఁ బలుగసిత్రంపి గాఁగఁ, బవనశాపసీయమావిప తాపవహ్ని
గ్రాముకాలకళాపిపూత్కారచయమొ, నాఁగఁ బొగఁ బర్చె మానిగ్రాగ్రమంబు.

మ. లలి నుర్వీతలముం బగిల్చి నభ మెల్లం దానయై యెమ్ములం
గలకీలాలపుజాలు మేలుడిపి తద్గ్రాహ్యపక్షదలంపఁ మాహా
బలునవ్వేసవి వహ్ని దాశరణముఁ బ్రాపించి కన్గ్రోసు
జ్వలుఁడై నాఁటనుగోలె వాఁడు సఖుఁడన్ బ్రఖ్యాతిఁ గాంచెన్ ధృఁగన్. 31

మ. అహహా లోకములేకొలంది మనుఁ కీలాకీలవాతూలదు
స్సహమై తీండ్రిలుచుండు వేసవికి నీశశ్రీశవాగీశుల
న్యహముఁ మూర్ధమునందు శయ్య సిగమవ్యాపారపాత్రంబునన్
బహుమానింతురు వారిఁ దత్సమయతాపక్రాంతిశాంత్యర్థమై. 32

ఆ. పగలు విస్తరించి మిగుల వేఁడిమి చూపు, తపనుఁ జొరక చాయ తరులనీఁగెఁ
బరమసాధ్వియయ్యు భర్తవిన్నాడె నే, తగఁ గ్రౌర్యసేయఁదగదు పతికి. 33

తే. సూర్యుఁడు నిజప్రతాపంబు చూపఁ సూర్య, కాంతములు రేఁగి నిప్పులు గ్రక్కుఁ దొడఁగె
నినుఁడు కోపింప బలిమి రవిను మడించి, కడిమిచూపుటధరణి నిక్కంబు కాదె. 34

సీ. యంత్రధారాగృహాభ్యంతరాళములందు వరవర్షిసీధుయోధరములందుఁ
గమనీయగోస్తనీకాయమానములందు ఘనసారకదళికావనములందు
బహుపాదపాదపప్రబలవాటికలందుఁ గాసారతీరసైకతములందు
మల్లీమతల్లికావల్లీగృహములందు నికటపానీయశాలికలయందుఁ
ఆ. బరువమగుపండువెన్నెలబయళులందుఁ, దరళితమ్రుతాళతాలవృంతములయందుఁ
గేవలాసక్తులగుచుభోగింపనురిగి, పాయరామందువేసవిఁ బతులుసతులు. 35

తే. అటనభంబునదంబయ్యెనంబుదంబు, పశ్చిమంబునసింద్రచాపంబుదోఁచె
నోలసితూరుపుగాడుపులుత్రిమ్మన, నవనవతటిల్లతావితానంబు బెరసె. 36

సీ. తపము పెంపునఘోరతమమైదిశలఁ బ్రాఁకి జలబిబాంధవ్యుఁగప్పుశార్వరంబొ
కేళిసీవృత్తభంగికిఁగూర్చుమెఱపులఁ గరదీపికలఁ జేరుకజ్జలంబొ
పర్జన్యశరణంబు ప్రాపించిగఱులతోఁ జనుఁ గ్రుమ్మరుశిలోచ్చయచయంబొ
ధరణీధరములేర్చుదవవహ్నిపవనున వెడలుధూమస్తోమవిస్తరంబొ
గీ. యోగశయ్యాభిముఖముగానొలయఁజూచి, శ్రీమహావిష్ణుపదమునకై సేయుటకును
వడలునిద్రావధూటిమైవిలసనంబొ, నాఁగనభమునఁదనరె ఘనాఘనంబు. 37

క. తళతళమెఱసెన్ మేఘము, పెళపెళనుఱిమెన్ నభంబుఁ బెటలువాఱం
బలపలగురిసెన్ వర్షము, జలజలనిలనింద్రగోపజాలముఁ రాలెన్. 38

తే. తపమునకువిఘ్నకరియంచుఁ దలఁపఁ దన్కఁ, గోలయుంవర్షావధూటిపయోధరముల
వేయికరములనింపెనవ్వేడబమున, నపుడ శాంతించె నతనిమహాతపంబు. 39

ఉ. మించెఁదళత్తళద్రుచులమీఱిమెఱుంగులమొత్తముల్ విడం
బించెదిగంతరాళములఁబీలిక్రుద్దూర్జితగర్జితధ్వనుల్
నించెఘనాఘనంబు ధరణీవరణంబునభూరివారి న
ర్తించె మయూరవారము పరిస్ఫుటబర్హసమర్హణార్హమై. 40

శా. అన్యాయంబున హెచ్చి గ్రీష్మఋతురాజశ్రాంతముఁ భోదనో
దన్యాతాపమునేర్పరింపఁగనిక్రోధస్ఫూర్తిగర్జిల్లెప
ర్జన్యుం డభ్రరథస్థితిన్ మణిగణచ్ఛాయల్ దలిర్పన్ మహా
జన్యస్థేమముసూపెనో యన శరాసారంబు పర్వెన్ వడిన్. 41

వ. వెండియుం బుటపాకభాస్వరకార్తస్వరలతావితానంబుల తెఱంగునం దుఱంగలించు మెఱుంగులమొత్తంబులును, మెఱుంగులమొత్తములతోడ నుదాత్తమ్ములై మందర మంథానమథనపరిక్షుబ్ధదుగ్ధజలనిధనిర్ఘోషంబులవిధంబున నూర్జితంబు లగుగర్జితంబులును, గర్జితంబులతోడం బరిస్ఫూర్జితంబులై దశముఖసంగ్రామసమయసన్నాహన సముద్దామరామకరలఘువనినిర్గతశరాసారంబులకరణి ఘోరంబు లగుధారాళధారాధరధారాసారంబులును, ధారాసారంబుల ధరాపరాగంబులు దుర్దమంబు లగుకర్దమం

బుట్టినకొలంది నిలువక జాలువాఱి కాలువలై నిలుకడ లేక తెప్పదొరలం బొరలుజలప్రవాహంబులును, జలప్రవాహంబులతరణంబులకుఁ గరణంబులులేక యిరుగడలం బడలుపడి పడిగాఁపులై యున్న యధ్వన్యులును, నధ్వన్యు లగుపథికులయోగక్షేమసమన్వేషణంబు లగుభాషణంబుల ముఖరంబు లగుముఖంబుల నిన్నఁ జినం బోలయ నిట్టి ప్పిసిగుప్పుచు నుభాగమసంబున కెమరుచూచుకుటుంబినులును, కుటుంబినులధాన్యంబులకుం గారణంబు లయినకృషివ్యాపారంబుల నపారంబులగు వాళవాళికలం జెలంగు ప్రబలహాలికులును, హాలికులపరిశ్రమంబులం బ్రశస్యంబు లగుసస్యంబుల నుదారంబు లగుకేదారంబులును, గేదారంబుల సమృద్ధి నభివృద్ధిం గాంచుమహాగ్రామంబుల శుభసన్నివేశంబు లగుదేశంబులుం గలిగి వర్షాగమంబు సుగమంబై ప్రవర్తిల్లుచుండెను. 12

క. వచ్చెన్ శరదాగమ మొగి, విచ్చె న్నేత్రాంబుజములు విష్ణుఁడు ఘనసై
హెచ్చెన్ గాన వనంబులు, మెచ్చెన్ బహుసరసమనసులు మెసవుకసవులన్. 13

చ. కొలఁకులు చేరెఁ బద్మినులకుం గను వేఁగుఁబడి రెడ మేఘముల్
పలుకులఁ జేరెడం గొంకలను పంకిలఁబంకములారె భేకిక
వాళివాళికంబులూరెఁ గలహంసరుతమ్ములు మీరెఁ గేకినుల్
వలవలబారె సస్యము నవీనరుచిం దనరారె నత్తఱిన్. 14

చ. అరయఁ బ్రతీక్షఁ జే సూనత నంపి పయోదము ఘోరఘోషవి
స్ఫురిత సకంకజీవన మొసంగె జనంబుల కేటిధర్మము
ర్వరనిఁక వారికల్మషము వాఁపెద నంచు గహించెనో యనన్
శరదృతువాప్పెనో హృదయసమ్మద నిర్మలవాగ్విపూరమై. 15

వ. ఇత్తెఱంగున నందు అంగలించి శరద్వాసరంబు భాసురంబుగ నట యుండ నారదమహాముని వాక్యంబులం బుట్టిన యాగ్రహావేశంబున దేశంబు యోగక్షేమంబులఁ దెలుపంబనిచిన చారు లాదుష్యంతునకుం బొడసూపి జయజయశబ్దపురస్సరంబుగా మ్రొక్కి మహారాజ శిఖామణీ! దేవరయానతి సకలదెసల యోగక్షేమంబులు నెఱిఁగివచ్చితి మమ్మహామునివాక్యంబు లనృతంబగు నేకాంకిరి తరక్షుహర్యక్షప్రముఖంబు లగుసత్త్వంబుల గిరితరంగిణీతటోద్దేశంబులు దుష్ప్రవేశంబులై యున్నయవి నయా చరణపరిణతసత్త్వాతరణంబున నార్తులకు శరణంబ వగుము. 16

ఉ. ఒంటరుకాశచామరవిలాసము పొంది రచంకజాతప
త్రలసనముం బొనర్చుచు శరద్రమణీమణి తోడుసీడగా
గెలువడి వెంటనంటి యటవీతటవీథుల సత్త్వకోటులన్
గెలకొనసీక త్రుంపఁ దగు నీలకుమారకుమార విక్రమా! 17

క. అనిచారులు వినిపించిన, విని వారిఁ గనివమానించి విభుఁ డిట్లనియెన్
ఘనధాటిన్ వనవాటిన్, గొనగోటన్ సత్త్వకోటిఁ గ్రుమ్మెద నెమ్మిన్. 18

క. రాఁ బనుపుఁడు పార్శ్వికులఁ, దేఁ బనుపుఁడు తెఱఁగుపడఁచి తేరటసఖుపం
గాఁ బనుపుఁడు జయభేరిన్, వేఁ బనుపుఁడు కర్మకరుల వేగిరపఱుపన్. 49

వ. అని యివ్విధంబున. 50

క. ఆఖేటమునకు ధాత్రీ, శేఖర్షభుఁ డనుమతింప లేలెం డనుచున్
శ్లాఘించుచుఁ బడవాళుల, లాఘవమునఁ బనిచి రగ్గలంబుగఁ జారుల్. 51

వ. తదవసరంబున. 52

మహాస్రగ్ధర. మృగయాప్రస్థానభేరుల్ మిగులఁ జఱచినన్ మారుఘోషంబు పేర్మిన్
గగనంబున్ భూతలంబున్ గడగడ వడఁకెన్ గంధులింకెన్ దలంకెన్
దిగిభశ్రేష్ఠంబు లెల్లం దిగదిగదిరిగెన్ దేవయానోత్తమంబుల్
నగముల్ ఘూర్ణిల్లె నానానగచరవంశముల్ నర్దెసల్ ప్రాఁకె ఖేలెన్. 53

వ. మఱియు నజ్జనపతి మజ్జనంబొనర్చి చీనాంబరాభరణమాల్యాంగరాగంబుల నలంకృతుండై కాల్యకరణీయంబులు దీర్చి యగ్నిసమారాధనంబు నడపి గోభూహిరణ్యాదిదానంబుల బ్రాహ్మణులం దనిపి భక్ష్యభోజ్యంబులం దృప్తుండై తనుత్రాణశిరస్త్రాణంబులు దాల్చి సన్నద్ధుండై భూసురాశీర్వచనపూర్వకంబుగా శుద్ధాంతంబు వెలువడి కక్ష్యాంతరంబులు గడచి యేనుంగుమొగసాలకుఁ జేరఁజనునవసరంబున. 54

సీ. మెఱుఁగువజ్రములఁ బచ్చనికమ్ములనుసుగాఁ గిలకలఘాతచక్రములతోడఁ
బచ్చరా మొసలివాపవసెంపునొగలపై నొఱపైన జలపోతయుగముతోడఁ
బసిఁడిచట్టపుఁ గోప పద్మరాగముల చప్పరము చెక్కడపుఁ గంబములతోడఁ
నీలంపుటిరుసు టందికనమర్పఁ దలిర్చు కెంపురావలుఁ బ్రడెక్కెంబుతోడ
తే. గొలుసుజగజంపుముత్యాలగొడుగుతోడ, సిగసిగయ్యప్యరాగిఘంటికలతోడఁ
జతురపల్లవపల్లవాశ్వములతోడ, సారమగు తేరుసారథి చేరఁదెచ్చె. 55

వ. ఇవ్విధంబున సారథి తేరాయితంబు సేసి తెచ్చిన. 56

చ. వలగొని మ్రొక్కుచుం జతురవైఖరి నారథతల్లజంబుపై
నెలకొని రా ధరాశశికి నెయ్యపు మెలగ్పనివాళులిచ్చుచున్
జెలువము మీఱఁ గ్రొవ్విరుల సేసలుచల్లిరి భామినుల్ సిర
గ్గళజయభేరికాపటహకాహళముల్ మొరయం బొరింబొరిన్. 57

వ. ఇట్లు మదద్విరదరథతురగసైనికసికతదుర్గం బగు రాజమార్గంబున మందగమనంబునం
బురందరవిభవంబునం జనిచని పురంబు నిర్గమించి. 58

చ. పరిఘభుసుండికాముసలపట్టిసకుంతకుఠారశూలము
ద్గరకరవాలతోమరగదాశరచాపకఠారధారులై
పరిగొని యగ్రభాగమునఁ బార్శ్వికుల్ నడవన్ మహీతలే
శ్వరుఁడు రథస్థుఁడై కుసుమశాలివనాలి వయాళి వెల్వడెన్. 59

దీవమిటారి జవ్వనపు దీము పికాళుల మెట్టపంటఁ గ్రొం
బూవిలుకాని సాహిణపుఁ బ్రోవరి యామని వచ్చె నత్తఱిన్. 70

సీ. తొలుదొల్తఁ బండుటాకులు రాలినవె త్తి యొంపు రెండిరువుల నొఱపుమీఱి-
బడపడి తలిరుసొంపములఁ దుంపెసలాడి పసరుమొగ్గల దీసి నెసక మెసఁగ
వెనువెంట ముకుళముల్ విప్పవాఱఁ బసన్పు విరులతండములతో విఱ్ఱవీఁగఁ
దోడ్తోడ నెత్తావిదొర కూపుప్పొడి రేఁచి కమ్మఁ దేనియసోనఁ గదలుకొనిపె-
తే. ప్రకట శుక పిక శారికా షట్పద నికర, సుకర కుగవక మరువ కాశోక తిలక
తిలక సహకార ముఖ భూరి తరువాళి, నాఁగఁ జాలించు నవవసంతాగమమున. 71

లయగ్రాహి.—
అంపములఁ బిందుకు శిలంపములచందమునఁ గెంపలరుకులం గవిరికందొవలవింతై
సంపుగలయందొసఁగు క్రొందవిరులం దనరు పెందరులఁ జెంగి చెలువొందు విరులందున్
గంధవహమంద మకరందరసముగ్గినినుండు శమసుంధరుల దుంగనుపుచుండా
గంధనిసి డెందమలరం దినమునందె మొగయందగు మిళిందముల బృందము చరిందున్. 72

ఉ. కమ్మనికమ్మ తెమ్మెరలకుం దులకించి వసంతవేళలన్
గొమ్మలు కాననాంతరనికుంజములన్ జెలువారసొంటిమైఁ
బమ్మిన తత్తిచే నెనయఁ బల్లవకోటులదూగ వేలతో
గొమ్మనిమూడి క్రొవ్విరులపుం గూర్చె బళీ సుమనస్సమూహముల్. 73

ఉ. ప్రీతిఁ దలిర్చె మాధవుఁడు పెంపెసలారెను వేళ భూమిరు
డ్జంతుల కెల్ల నందు నొకజాతి రహింపక యున్కిఁ జూచి త
జ్జాతి రహింపనిత్తురమిషంబునఁ గన్గొనఁ దగ్యె యామధవుం
డాతెఱఁగట్లగున్ ఘనసనాశ్రితులం గనుతింతురే నృపుల్. 74

వ. ఆసమయంబున. 75

ఉ. మోదమొనర్చెఁ బుష్పాదుల ముగ్గులపై నొఱపైనమొగ్గలన్
గేదఁగిపూలటెక్కెములఁ గెందలిరాకుల తోరణంబులన్
ప్రోదివహించు పక్వఫలపుంజములన్ శుకకోకిలాళిస
న్నాదములన్ని కుంజభవనంబుల నీలనృపాలసూతికిన్. 76

వ. ఇట్లు వసంతసమయసముచితకిసలయకుసుమవిసరసరససాలప్రముఖసాలరుచిరంబు లగు నుద్యానంబులం జూచుచుం జనునమ్మహారథుని రథవేగంబునకుం గాక నీరువట్టునం బీఱువోయి సైనికులంతనంత నిలిచినం జనిచని. 77

మ. అటఁ గాంచెన్ నరలోకవర్యుఁడు సమగ్రాశ్చర్యుఁడై మాలినీ
తటభూమిం బనసానసామ్రసరళప్లక్షామ్లికాశాల్మలీ

వటనారంగలవంగలుంగలవలీవాళాదిశాఖిచ్ఛటా
రటదున్మత్తవిహంగచంగయుగళభ్రాజిష్ణుమహోద్యానమున్. 78

వ. ఇట్లనతిదూరవర్తి యగునయ్యుద్యానంబుఁ గనుఁగొని హృదయానందపోషంబు లగు
నందలివిశేషంబులకు నాశ్చర్యంబు నొందుచు సూతునితో నిట్లనియె. 79

క. ఆనందనవనముంబలె, నానందనమాచరించు నశ్రాంతంబున్
దైనందినఫలకుసుమ, శ్రీ నొందిన యివ్వనంబు చిత్తంబునకున్. 80

సీ. ఘనసారఘనసారకదళికామోదంబు నాసాపుటప్రీణనంబొనర్చు
ఫలపూరఫలపూరమిళదామ్రజగలంబు రూఢిమై రసనకు రుచులఁ గొలుపుఁ
గలకంఠకలకంఠకాకలీకలనంబు శ్రవణరంధ్రములరంజన మొనర్చు
వనజాతవనజాతఘనచాకచక్యంబు నయనాబ్జములకు నానంద మొసఁగు
తే. సవిధవివిధాగమక్రమప్రంసదంస, లసుమరసమగ్నమాలినీలలదభంగ
భంగశీకరనికరార్ద్రపవనడింభ, మవయవములకు నుల్లాసమావహించు. 81

క. జ్ఞానేంద్రియపంచకమున, కానంద మొనర్చుచున్న యడియట్లగుటన్
మానీశ్వరుఁడొక్కఁడుఁడి, కాననమాశ్రమముగాఁగఁ గైకొనఁబోలున్. 83

సీ. తాపసార్భకకరప్రాపితాహారంబు రుచిచూచుగండభేరుండచయము
గండభేరుండముల్ కండూయనముచేయ జతగూడిక్రీడించుశరభవితతి
శరభచంగముల విస్ఫురదూరువుల మేలు లూని నిద్రించుపంచాననములు
పంచాననములతోఁ బరిచయంబులు చేసి భయమేది విహరించుభద్రకరులు
తే. భద్రకరికరశీకరప్రబలసేక, సరళకర్పూరకదళికాతరులనీడఁ
బొరలుమార్జాలములమీఁద నొరయనెలుక, లద్భుతక్రమమైన యీయాశ్రమమున.

సీ. వేదాంతవాగర్థవివరణం బొకచోట నొకచోటనృత్యన్మయూరనివహ
మధ్వరక్రమసముద్యమఘోషమొకయోర నొకయోర మత్తాళినికరగీత
మభ్యాగతబ్రాహ్మణార్చనం బొకక్రేవ నొకక్రేవఁ బారావతకలరావ
మతిఘోరనియమసంయమియూథ మొకపజ్జ నొకపజ్జ శారికాధికవిలాస
తే. మఖిలతంత్రస్వతంత్రసంఖ్యావదగ్ర, గణ్యపుణ్యకథాసుధాకలన మొకట
నొకటనవకుంజపంజరశుకమృదూక్తి, శాంతశృంగారముల వేడ్కఁ సలుపునిందు. 84

క. ఈయాశ్రమతిలకమునకు, నేయాశ్రమమైన ధరణిసీడనఁదగునే
పాయక తపమీయెడనస, హాయుండై సేయుచున్న యతఁడెవ్వరొకో. 85

క. ఆమునిసుత్రామునిసభి, రాముని సేవింపవలయు రాజిల్లతికా
ధామమ్మునఁ బ్రేమమ్మున, సేమమ్మున నిలుము వారలు సేవలు దేరన్. 86

క. అనుచుంజనుచున్ జనుచున్, మునిచంద్రునిఁ జూడఁ గోరి ముదమెదనొదవన్
జిననాథతేజుఁడగున, జ్జననాథుఁడు తేరుడిగ్గి సత్వరుఁడగుచున్. 87

వ. ఇవ్విధంబున నన్నరపతి రథావతరణంబుచేసి విశాలరమణీయం బగులతామండపంబున రథంబు నిలుపునట్లుగా సారథిం బనిచి సవినయంబుగా నాశ్రమాభిముఖుండై నడచె ననవిని కుతూహలాయత్తచిత్తుండై జనమేజయుం డదు తరువాతిచరితం బడుగుటయును. 88

చ. సనకసనందనాదిమునిసన్నుతపాద ! రమావినోద ! కాం
చనమయవాస ! శత్రుజనశాసన ! దాసనమస్క్రియాప్రియా !
వనరుహనేత్ర ! పత్త్రరథపత్త్ర ! పవిత్త్రచరిత్ర ! సామగా
యనఘన శేషశైలనిలయా ! వలయాదివి శేషభూషణా! 89

పంచచామరము. పురాణభోగిభోగ భాగ పుణ్యగణ్యనర్తనా !
విరించిసంచిత ప్రపంచవిశ్రుతాత్మకీర్తనా !
స్మరాతిసుందరాంగ ! సత్తమ స్తమోపికర్తనా !
చిరస్ఫురద్విశేష శేష ! శేషశైలవర్తనా! 90

గద్య. ఇది శ్రీమత్కౌసల్యానందనప్రసాదసమాసాదితకవితావిచిత్ర మైత్రేయసగోత్ర నృసింహగురుపుత్ర కృష్ణకవిప్రణీతం బైనశకుంతలాపరిణయం బనుమహాప్రబంధ మ్మునం దిష్టదేవతాప్రార్థనంబును, కృతిపతిగుణకథనంబును, గ్రంథావతరణంబును, దుష్యంతనారదసంవాదంబును, ఋతువర్ణనంబును, దుష్యంతమృగయావినోదనం బును మొదలగు విశేషంబులుం గలిగిన ప్రథమాశ్వాసము.



శ్రీ ర స్తు.

# ద్వి తీ యా శ్వా స ము.

---



కర ! రిపుభీకర! ర
త్నాకరగంభీర ! పండితవశీకర ! ప
ర్వీకరవరపర్యంక ! గు
ణాకరమణివలయ ! వేంకటాచలనిలయా! 1

వ. దేవా! వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లు దుష్యంతుండయ్యాశ్రమంబుఁ
బ్రవేశించి యందలిమునికుమారులవలన నది కణ్వాశ్రమంబనియును నమ్మహాత్ముండు
తీర్థయాత్రాచరణంబునకు వెడలె ననియును విని విఫలమనోరథుం డయ్యును నాంగి
కంబు లగుశుభసూచకంబుల నిరూపించుచు వధూజనసల్లాపంబు లాలించి యవ్విశేషం
బన్వేషింపం దలంచి. 2

శా. ప్రాంచద్బాలరసాలమూలమున శుంభల్లీలనాసీనుఁ డై
కాంచెన్ బార్థివమౌళి పూఁబొదలయిక్కం బక్వబింబాధరం
గించిత్కుంచితకుంతలన్ మణినిభాంగిన్ జక్రవాక స్తనిన్
జంచద్భ్రూయుగమధ్యనష్టమనిశాచంద్రాలికం బాలికన్. 3

తే. కాంచిమదనవికాసంబు గౌరవంబు, సాదరాలోకనముసంశయంబుమరులు
విస్మయంబునురాగంబు వెలిఁగదోఁప, భావశబలాంతరంగుఁ డై పార్థివుండు. 4

వ. ఇట్లు కనత్కనకరంభాసుభగంభావుకకదంబకమధ్యంబున ద్రాక్షాగుళుచ్ఛరంభోళికా
మధురమధురసామోదమేదురమధుకరనికరఝంకారసంకులం బగులవలీకాయమానం
బు చేరువం గుసుమితలతావలంబనంబునం దనరు నవ్వనరుహాముఖిం గాంచి యనన్య
కన్యాసామాన్యం బగుకన్యకామణిలావణ్యంబునకు నాశ్చర్యంబు నొందుచు. 5

క. శరణాగతభరణాతత, కరుణావరుణాలయుండు కమనీయసుధా
కిరణాన్వవాయమణి యయ్యరుణాధరఁ జూపి సందిహానుండగుచున్. 6

క. సురకన్యకయో విద్యా, ధరకన్యకయో నిజంబు తర్కింపఁగఁ గి
న్నరకన్యకయో కాక, న్నరకన్యకలందు నిట్టినలువుం గలదే. 7

పంచచామరము. జగానిగారపున్ మెఱుంగుచాయలీను మేనిడాల్
మిగుల్ మొగుల్ మఱుంగుఁ బాసి మించుమించులన్ జిగిన్
దగున్ సదంగభూతిచేతి దాతిరీతి మెచ్చఁగా
ర్చుగొంటువాలుఁగంటిజాడ జూడఁ గంటి నొంటిమై. 8

ఉ. ఏమహిళావతంసమున కేనవమన్మథమూర్తి కిట్టి క
న్యామణి గల్గెనో యలివరాశ్రమమంజులకుంజపుంజమి
క్కోమలియాటపట్టుగుటకుం గతమెయ్యదియో నిసర్గలీ
లామధురంబు లీవెలఁదిలక్షణముల్ గణుతింప నర్హముల్. 9

ఉ. ఆనడ లామెఱుంగుఁ దొడ లాజిగిపొక్కిలి యానితంబ మా
కౌనలయూరు నాభిగువ్వగబ్బిజగాచనుగుబ్బలాగళం
బానునుఁ గేలు నాపెదవి యాకనుదోయిబెణంగు లాకురుల్
గాన జగంబునం గలువకంటి నొకర్తును గంటి నియ్యెడన్. 10

మ. తలిరుంబోఁడినితంబబింబవిలసద్ధమ్మిల్లబంధంబుతో
బలభిన్నీలము పోరి పూరిఁ గఱచున్ బాథోధరశ్రేణిపె
ల్వేలఁ బాఱున్ గుమురై మదభ్రమరముల్ నెత్తమ్ములం జేరు నె
మ్ములపింఛమ్ములుజాఱు నంధతమసంబుల్ బల్గుహల్ దూఱెడున్. 11

ఉ. ముందుపసిండితమ్మిబలుమొగ్గల మొగ్గర మావరించు మే
ల్పిందెదువేల్పుగుబ్బగివజీరుని జీరు నధఃకరింపఁగాఁ
గ్రొందలిరాకుబాకుదొరకుం దొరకించు భవంబు చెల్లరే!
చందనగంధిచన్నుఁగవ చంద్రుఁడొ యింద్రుఁడొ యాయుపేంద్రుఁడో. 12

మ. స్ఫురదాపీనకటీరసైకతతటీసువ్యక్తనాభీసరో
వరమధ్యంబున రోమరాజి యనుశేవల్ బద్మనాళాంతరో
త్కరముందోఁచి వళీతరంగముల నూఁగంగుట్మలశ్రీపయో
ధరముల్ గ్రొవ్విరిలీల మోమళులచందంబక్కురుల్ గైకొనున్. 13

తే. కెంపురాఁబోడితలిరుఁబాయంపుగుణము, పచ్చిపవడంపునిగనిగల్ భాగనియతిఁ
గూర్చి యమృతంబు పదనిడి ఘుటికచేసెఁ, గాక విధి యింత యొప్పునే కలికిమోవి.

సీ. కణఁకనూర్ధ్వాధరాంగవిధానమున ధాతకరయంత్రణంబులఁ గ్రాఁగనోపు
నంతకంతకు నింతలైనగుబ్బలు విఱ్ఱవీఁగి పైఁబడు నంచు డాఁగనోపు
జఘనభారము ఘనస్తనభరంబని మొనఁ ద్రోయమధ్యస్థమై తొలఁగనోపు
గురుకళత్రంబులఁ గూడినపరితాప మెద శగ్గమైన వహింపనోపు

తే. అహహ! సకలాంగగౌరవం బావహించుఁ, దరుణిమం బూర్జితం బైన తరుణిమధ్య
మరయ నరయంగ నతికృశం బయ్యె ననవి, కనుసరించిన మదిమానఁ దనెడుకరణి. 15

ఉ. కొమ్మ మెఱుంగుఁ జన్నుఁగవ కోర్తలభిన్నము లైన యాత్మకుం
భమ్ములఁ జూచి యాచవిసాబంగుఁ దొడల్ దొడరన్ వగర్చు హ
స్తమ్ములఁ జూచి తన్మృదుపదమ్ములు పుష్కరమూన వ్రాలు నా
గమ్ములఁ బ్రోవ బాలగజగామిని యున్ బిరుదంబుఁ గైకొనెన్. 16

మ. ఒరపుం బూఁతపసిండివంటిననుమే నొయ్యారపున్ మధ్యమున్
మెఱుఁగుం జెక్కులు తేనెలూరుపలుకుల్ మించుల్ పిసాళించువా
తెఱ విన్నాణముఁ గుల్కుముద్దుమొగమున్ దీర్ఘైన ఫాలంబు బి
త్తరపుం జూడ్కి వలుందగుబ్బకవ వింతల్ గూర్చుఁ బన్వంగికిన్. 17

వ. అని యివ్విధంబున. 18

ఉ. నీలనృపాలసూతిరమణీమణి సన్నక సన్నవేది దృ
గ్జాలము బాలఫాలఫలకమ్ములఁ జెక్కులగుబ్బచన్నులన్
గీలుజడన్నడన్ దొడలఁ గేల్గవ మైఁబిలమైనయందమున్
మేలిధనంబు రాజునకు మెచ్చుగ ముచ్చిలి నించె నెమ్మదిన్. 19

ఉ. బాలిక మోముచందురునిపై మధురంబగు మోవిజుంటిపై
నోలిఘనస్తనస్తబకయుగ్మముపై నునుఁ గేలుఁదమ్మిపై
వాలిఁ గపోలపాలికలనందము గుల్కు జవాదిపై మహీ
పాలునివీక్షణభ్రమరపఙ్క్తులు గంతులిడున్ జెలంతులన్. 20

వ. ఇత్తెఱంగున నక్కన్యకాపుష్పపరిసరదామోదవ్యతికరంబు లగునీక్షణమధుకరంబుల మరలింపఁ జాలక భూపాలతిలకుండు సాశయడోలాయత్తం బయ్యెనుం జిత్తంబిగు రొత్తం బ్రొత్తమరులునం గెరలుచు నాత్మగతంబున. 21

క. చదురాడఁ బథ్యమనితోఁ, చదు రాడనపథ్యమనుచు సదమదమయ్యెన్
మదిరానన వశమైనా, మది రానన వశమె మరులుమరలుప సింకన్. 22

చ. అకటకటా! మదీయహృదయం బనయంబు నయంబటంచు నెం
చక యకలంకభావమునసంధిలు కణ్వమునీంద్రుపట్టిపైఁ
బ్రకటతరానురాగమునఁ బాయక యుండుట చిత్రమయ్యెఁ గౌ
తుకమున నిందువంశజులు దుష్టవిచేష్టితముల్ భజింతురే. 23

మ. అని ధాత్రీవిభుఁ డంతఁ గొంతవడి చింతాక్రాంతుఁడై క్రమ్మఱం
దనచిత్తమున నిశ్చయించె నిటు లేఁ దర్కింపనిం కేల క
ణ్వుని లోకమ్మున నూర్ధ్వరేతుఁ డన విందుంగాదె యట్లౌట నా
యనఘుం డీచెలి నెట్టు గాంచుఁ గలదే యాకాశచిత్రంబిలన్. 24

వ. అదియునుం గాక. 25

ఉ. అంకిలిగాదు నాదు హృదయంబు తమోరహితంబు గావె నీ
కుంకుమబొమ్మ పైమరులుకొన్న విధంబుఁ దలంచి చూచినన్
శంకిల నేటికీ వెలఁది క్షత్రపరిగ్రహపాత్రయై తగున్
మంకుఁదనంబులేని ఘనమానసవర్తనముల్ ప్రమాణముల్. 26

వ. అని వెండియు బహుప్రకారంబులం దర్కించుచు నక్కాంచిదవలగ్నయెడ లగ్నం బగుట నుద్విగ్నంబై నిజాయత్తంబు గాక చిత్తం బక్కన్యకాసరససల్లాపసమాకర్ణన కుతూహలంబునం బొదలం బొదలుమాటునం బొంచి సమయంబుఁ బ్రతీక్షించుచు నవసరంబున నత్తెఱం గెఱుంగక యత్తన్వి యుద్యానసమన్వేషణంబు సేయుచు. 27

మ. తనయప్రేమవివర్ధమానసరళద్రాక్షాలవంగాదినూ
తనశాఖిప్రతతీతతిన్ దడవి పాదస్సేకమున్ జేయఁగా
ననసూయాదులఁ బంచి మున్ను తనకై యారాజవర్యుండు పొం
చినయోలంబునఁ గన్నెగన్నెరుపొదం జేరెన్ యదృచ్ఛాగతిన్. 28

క. చేరువఁ జేరినవారిం, గారవమునఁ బౌరవుండు గనుఁగొనుచుండెన్
సారసముఖి యారసికుఁడు, తారసమై యున్న సన్న దలకొనకునికిన్. 29

వ. కుసుమఫలభరానమ్రకమ్రతరతరునికరమ్ముల నలుగెలంకులం గలయం జూచుచు. 30

సీ. సరసులఁ గలఁచునంచల మించు నడనడి కడ్డగ్గనకు దోప మలవరించుఁ
గన్నెమావులకొమల్ గముచుకోకిలముల పరువంపుఁ గలరవాగ్ఘటిన దంచు
ఫలభంగములు సేయుకలికి చిల్కలనోటి పరుసఁదనంబు వాబలిమి మాన్చు
సుమరసమెల్లను జూఱఁగాడెడు తేంట్ల లఁబి తత్తరపుఁ జూడ్కి నిలుపరించు
తే. యానమునఁ బ్రౌఢిగాన విద్యలసిరూఢి, పలుకులసొబంగు వాలుఁగన్నులబెడంగు
జనరఁదనరాకవనదేవతలు భజింప, నాత్మపనవాటి మెలఁగుచు నవ్వధూటి. 31

వ. వెండియు. 32

చ. జిలిబిలి చెక్కులార్చుచు ఖచిక్కనముక్కునఁ బక్వదాడిమీ
ఫలయుగళంబు నొక్కనొకబాలశుకంబు రకంబుఁ జూచి వా
బలిమినదల్చుచున్ విరులబంతి నెలంతుక దాని వేసెను
త్తలమునఁ దప్పి దారియది తాఁకె నృపాలుని పెన్నురంబునన్. 33

క. దూరపుఁజూడ్కులనుక్వ్వేబు, లూరెడు సెడ విరులబంతి యురమునసోఁకన్
జారుముఖమై చెనపిగని, మారుఁడు ధృతిఁ గరఁచె నృపతి మతిఁ దామఱచెన్. 34

తే. పొంచి తానుంటయెఱుఁగక పొలఁతి వైచెఁ, దవిలె విరిబంతి చిలుకకుఁ దప్పి కన్ను
విధికృతంబైనయట్టియవ్వేదబంబు, కనికనిజాంబు దెలియఁ దమ్మునజవిభుఁడు. 35

తే. ఆత్మవత్సర్వభూతాని యనువిధమునఁ, దామరులుకొన్న వాఁడయి తరుణి దన్ను

మరులుకొని చేరవచ్చి యమ్లానసూన, కందుకంబున వైచెనకాఁ దలంచి. 36

వ. మఱియును. 37

చ. పొలఁతుక దావపావకము పూరుషుఁ డాన్యఘుటంబటన్న ప్రాఁ
బలుకు నిజంబుగా మనుజపాలుఁడు క్రొవ్విరిచెండు సోఁకినన్
గులుకుమిటారి గబ్బిచనుగుబ్బ నురమ్మునఁ గ్రుమ్మినట్లు మి
న్నలమికొనం బ్రమోదకృతహారవచారుముఖారవిందుఁడై. 38

వ. ఇవ్విధంబునం గందర్పగోచరుండై యనురూపంబు లగువిలాసచేష్టితంబులం బొరలి యెట్టకేలకు నక్కళవళంబు దక్కి ధైర్యం బవలంబించి భూనాథుం డక్కందుకపాతంబు నిమిత్తంబుగా నమ్మత్తకాశినియన్వయనామగోత్రంబులుం దదభిప్రాయంబునుం దెలియువాఁడై యిట్లనియె. 39

చ. కలుషవికర్తనం బయిన కణ్వమహామునిదర్శనంబువాం
ఛిలి యిటరా మనోరథము చేకుఱదయ్యెఁ దపస్విలేమి సం
ధిలుగ మనశ్రమంబుఁ గడతేర్చుట కిచ్చట విశ్రమించితిన్
గలికిమిటారి! యిట్లు ననుఁ గందుకతాడితుఁ జేయఁబోలునే. 40

చ. దంతురదంతిదంతములతాఁకునఁ గ్రొచ్చిన పెన్నురంబు పూ
బంతిన గల్చునీ యతను బాహుబలంబున నగ్గమైపరి
శ్రాంతుఁడనైతి నిందుకులసంజనితుండను పౌరవుండ దు
ష్యంతుఁడ గుంతలక్షతమసారమణీ! రమణీశిరోమణీ! 41

క. ఓచెలి! యేనతిథి నప, ర్యాచరణార్హుఁడ నటంచు నాకస్మికమా
రాచదొరపలుకుపలుకుల, కాచిలుకలకొలికి యులుకు నలుకున్ బెలుకున్. 42

వ. ఇట్లా భూపాలుండు సాభిప్రాయంబుగాఁ బలుకుటయుం లజ్జాభయయుగాధీనరతయగు సమ్ముగ్ధ మధురగంభీరంబు లగునాకస్మికమహీపాలాలాపంబుల కులికిపడి చకితకురంగశాబంబుకరణిం గ్రేళ్లుఱుకు బేడిసమీలకరణిం బ్రేక్షణప్రభాజాలంబులు నలుగడలం గడలుకొనఁ గొండొక పరిభ్రమించి పయోధరమధ్యంబు వెడలు మెఱుంగుఁదీగియ తెఱంగునం బొదలమఱుఁగు వెలువడి యన్నరనాథుం డాసీనుండైయున్న యన్నవసహకారభూరుహంబు చేరువకుం జని. 43

ఉ. కోరికలూరఁ గన్గొనియెఁ గుంకుమబొమ్మ పసిండిచాయలం
గేరెడుమేనివాని శశిఁ గేరెడువక్త్రమువాని వెన్నెలం
గేరెడునవ్వువాని హరిఁ గేరెడుమధ్యమువాని మన్మథుం
గేరెడుశీలివాని రవిఁ గేరెడుతేజమువాని నవ్విభున్. 44

సీ. చిగురాకుఁ గిగి కాకసేయునంఘ్రులవాని రంభోరుగుంభోరురచనవాని
సురపొన్న నెరగొన్నపొంకపుపిక్కలవాని దృగబోధ్యముగ మధ్యమెసఁగువాని

మొగరాలనగఁజాలు నెగుబుజంబులవాని బింబానుబింబాధరంబువాని
నలతమ్మిచెలువమ్ముఁజిలుకుకన్నులవానిఁ దొగవిందుబెగడొందు మొగమువాని
తే. హారగలకోరమీసలహాయలువాని, నొఱపునెఱపెడువెడలుపుటురమువానిఁ
జొక్కులను జొక్కులను నఖస్ఫురణవానిఁ, గాంచిపులకితగాత్రియైకలువకంటి. 45

వ. ఇట్లదాటునం గదిసి యలసవలితంబులును ముహుర్ముకుళీకృతంబులును బ్రభానిర్నిద్రంబులును బ్రేమార్ద్రంబులును భావవ్యంజకంబులును హృదయరంజకంబులును నిమేషవిముఖంబులును క్షణక్షణాభిముఖంబులును లజ్జాలోలంబులును నగువీక్షణజాలంబుల మదనసుందరుం డగునారాజపురందరుం జూచి పంచశరసమాక్రాంతంబైననిజస్వాంతంబు భయవినయలజ్జాసంభ్రమసంభ్రాంతం బగుటయుం. 46

ఉ. బాల నృపాలు మ్రోలనిలువన్ ధృతిసాలక మేలిజాళువా
చేలచెఱంగుజాఱ నునుఁజెక్కుఁ జెమర్పఁగ లోచనప్రభా
జాలము క్రేళ్లువాఱఁగఁ గుచద్వితయంబు చలింపఁ జొక్కుచున్
సోలుచు సారెకున్ మరలిచూచుచుఁ జేరె నికుంజగేహమున్. 47

వ. ఇట్లు పేరెలుంగునం బెదరినమదనకలహంసకామినీకామనీయకంబున నమ్మత్తకాశిని తోరంబగు కరవీరంపుటీరం బోలమాసగాని. 48

ఉ. పూచినకప్పురంపనఁటిబోదెను ఱుంగునఁ జేరి మున్ను తా
వైచినబంతిచే నతనివక్షముగందుట కాత్మ విన్ననై
యాచెలి రాచకెంచెలువునందమఁ చందము తొంగితొంగి తాఁ
జూచుఁ దలంగు వెండియుఁను జూచుఁ దలంగు మెఱుంగుచాడ్పునన్. 49

వ. ఇవ్విధంబునం జూచుచు నాత్మగతంబున. 50

సీ. వదనశీతాంశుబింబప్రసన్నవసుధా విలసనంబువహించువీనినగవు
స్ఫురదంతరనురాగపూరస్ఫుటోద్గార గరిమంబుఁగనువీనికావిమోవి
కాయకాంచనకుటస్కంధబంధురశాఖ కారూపములు వీనిఘనభుజములు
నయనపద్మపలాశనానటన్మధుకర నికరాంచితము వీనిచికిలి చూడ్కి
తే. యహహ! విధుకులకలశవారాకరమున, నవయవస్ఫూర్తిమన్మూర్తినవతరించి
బాలికామానహరుఁడైనపంచశరుఁడో, కాక కేవలుఁడే యీగుణాకరుండు. 51

ఉ. ఆనగు మోము మోముగదియందులకించుఁగదా యథాసుఖం
బానన మోవి మోవిగదియందిలకించుఁగదా ప్రతిక్షణం
బానును మేను మేనుగదియంబులకించుఁ గదా యహర్నిశం
బీనరనాథునాథునిఁగ నేయరుణాధరనోఁచెనో మహిన్. 52

ఉ. ఈసుమకోమలాపయవుఁడీసుఖదర్శనుఁడీసుపర్వసుం
డీసులలాటుఁ డీసుభ్రుఁ డీసుగుణాకరుఁడీసుధాధరుం

డీసుకపోలుఁ డీసుముఖుఁ డీ తతి నన్ను వరించు నేని నేఁ
జేసినపుణ్య మెవ్వరును జేయరువో యువతీవతంసముల్. 53

క. దీమై పెరరేఁపఁగ నృప, సోముని ముఖవనరుహమునఁ జూడ్కులతోడన్
నామదివలగొని మరలదు, తామరసభవుండు దలఁచుతలఁ పెట్టిదొకో? 54

ఉ. క్రచ్చఱ మద్గురుండయిన కణ్వమహామునిదర్శనార్థమై
వచ్చిరి విష్టపత్రితయవాసులు వారలలోన నొక్కఁడున్
మెచ్చుఘటింపఁ డిట్లు నవనీరజదృగ్యతమానమానపా
టచ్చరమార! యీతని బెడంగు తగుందగు మేలు మాయురే! 55

తే. ఇతనిఁ గూడని సౌభాగ్య మేటిభాగ్య, మితని నుడువని నునుఁబల్కు లేటిపల్కు
లితనికిని గాని మైచెల్వ మేటిచెల్వ, మితని మెచ్చని సద్గుణ మేమిగుణము. 56

మ. అనుచుం డెందము గందళింప ధృతి జవ్వాడంగ మోహాంబుపై
గొన సిగ్గుఱ్ఱటలూఁగఁ గ్రొవ్వలపుఁ జూడ్కుల్ మీఱ వాంఛాలతల్
ననలెత్తన్ నరనాథదర్శనసవానందం బమందాకృతిన్
గని యమ్ముద్దులగుమ్మ మన్మథబలాత్కారక్షలన్ మ్రాన్పడియె. 57

ఉ. తూఁగొని ముందరం దఱుముదుస్సహరాగభరంబు డంబునన్
జేకొని త్రస్తగిన్ దిగుచు సిగ్గున ముంగలికిన్ బిఱిందికిన్
బోకడరాకడల్ వశముపోవక మన్మథుఁ డానవెట్టిన
ట్లాకలకంఠి నిల్చె నచలాకృతిఁ జిత్తరుబొమ్మకైవడిన్. 58

వ. ఇట్లు కొండొకతడవు నివ్వెఱపాటున నెద్దియుం దోఁపక నిలిచి యంతంగొంత వివేకించుకొని యుత్తరంబునకు మాఱుపలుకక యుపగణించి మరలుట కర్జంబు గాదని యూహించి యక్కాంతాలలామంబు సంతాపదంతురితం బగు నిజస్వాంతంబు చిక్కంబట్టి పొదలమఱుంగున నిలిచి మధురాక్షరంబుగా ని ట్లనియె. 59

ఆ. సార్వభౌముఁ డనుచుఁ జంద్రాన్వయోత్తముఁ, డనుచు మోహనాంగుఁ డనుచు ధీరుఁ
డనుచు శూరుఁ డనుచు నభ్యాగతుల్ వచ్చి, మిముగణింప విందు మీ తెఱంగు. 60

ఉ. భూరితరప్రతాపమున భూవలయంబున దుష్టసత్త్వసం
హారము సేయుచున్ గరుణ నాశ్రమవాసులఁ బ్రోచి కణ్వసే
వారతి మీరలిందులకు వచ్చుట నామది నెంచిచూడ భా
గీరథి పిచ్చుకుంటుపయికిం బ్రవహించుట సూ నృపాగ్రణీ! 61

ఉ. చేసితి మీకవజ్ఞ నృపసింహమ! సైరణ సేతురేని మీ
చేసినయాజ్ఞలో మెలఁగి చిత్తము రానడతున్ బ్రసన్నవీ
క్షాసుముఖంబు గాఁగదలి చయ్యన రాఁదగుఁ బర్ణశాలకున్
నాసఖు లేనుఁగూడి భవనంబున నిచ్చెద మర్ఘ్యపాద్యముల్. 62

ఉ. గాదిలిచిల్క పండుగొఱుకం దొరఁకొన్న తెఱంగెఱింగి నా
చేఁదఱకొత్తు క్రొత్తవిరిచెండున గండఱనేయ నేయ మీ
మైఁతవులంగఁబోలు నవమంజులవంజులకుంజపంజర
చ్ఛాదితులై భవాదృశులు చానలఁ గానలలో నలంతురే. 63

ఆ. కాదుబుద్ధికృతము గానిమ్ము కఠినమ్ము, గాదువిరులబంతి మేదినీశ!
దీనికింత ద్రవ్వితిరితగవెట్లొకో, మిమ్ముఁ జేసికొన్న మెలఁత సుఖము. 64

క. ఈవైఖరి నావెలఁదుక, భావాకూతంబు గాఁగఁ బలుకం బలుకన్
భూవల్లభుఁడావేళ్ల, ద్భావోల్లసదతనుతాపభరపరవశుఁడై. 65

వ. ఇత్తన్వి దైవానుగ్రహంబున నాయెడ బద్ధానురాగ యయ్యుం గానోపు లజ్జాభయంబులఁ గుఱుంగట నిలువం జాలక మఱుంగునకుం జనునప్పుడు తరుకంటకసంబద్ధంబగు చేలంబు సడలించుకొనునెపంబున మరలి సాభిప్రాయంబుగాఁ జూచుచుం జనుటయుం క్షమాపణంబునెపంబున నాజ్ఞానువర్తినినై చరియింపంగలదాన నని యభిప్రాయసూచనం బాచరించుటయుం గలిగియున్నయది యట్లగుట నారదవాక్యంబు సమకూడెంగాకేమి మదభిప్రాయసూచనంబున నిక్కలికిం గరఁగించి మనోరథంబు సఫలంబుగా నెలకొనందగునని యమ్మహీకాంతుండు సాంత్వనస్వరంబున నయ్యింతితోని ట్లనియె. 66

క. ఇవ్వలనవ్వలఁ బువ్వుల, క్రొవ్వలపులఁ బొదలిపొదలి కొననేటికి నీ
వెవ్వనిజవ్వనివివ్వని, దవ్వనివెఱచఱవ మెలఁగెదవు మేలు బళీ! 67

క. వాలాయంబుగ నీయెడ, నాలోలం బయ్యె హృదయ మలికులవేణీ!
హేలారతులం గౌఁగిట, నేలెదవో కాక మరునకెర నేసెదవో. 68

సీ. జలజాక్షి నీతనుశ్రమవారిపూరమ్ము పాద్యోదకమ్ముగాఁ బరిణమింతు
భద్రేభగమన! నీప్రమదాశ్రుకణజాల మర్ఘ్యతోయమ్ముగా నవధరింతుఁ
గలికి! నీకడగంటిగరువంపులేఁజూడ్కు లలరులసోనగా నందగింతు
నతివ! నీయధరాధరామృతాస్వాదంబు సరసంపువిందుగా సమ్మతింతు
గీ. బంధరచనాచమత్కారభరితసురత, మానితాయాసనిశ్వాసమారుతమ్ము
హితజలార్ద్రానిలమ్ముగా నిచ్చగింతుఁ, గనికరమ్మున బంగారు గనికరమ్ము. 69

సీ. కరువపల్కలచీరపరిధాన మెట్లోర్చె? నీమేను నవనీతకోమలంబు
మృగలూనకుశశిఖామిళన మెట్లు సహించె? నీయంఘ్రులభినవనీరజములు
బాలపాదపసేకపాత్ర మెట్లు వహించె? నీకేలు పల్లవశ్రీకరంబు
ప్రసవరేణుకరాళపవన మెట్లుభరించె? నీమోము దర్పణనిర్మలంబు
గీ. శీతలజలావగాహామస్నేహాతుపర, కందమూలఫలాశాదికదశనంబు
సేయుటకునెట్లు దనరె? శచీవిలాస, మెన్న దొరఁకొన్న నీచిన్ని యివురుబోణి!. 70

మ. చతురంభోనిధిమధ్యభూవలయరాజ్యప్రాజ్యసామ్రాజ్యశా
శ్వతదివ్యావ్యయనవ్యభవ్యముల నశ్రాంతంబు విశ్రాంతుఁడన్
బతిఁగా నన్ను వరించి యంచితమహాభాగ్యమ్ముఁ గైకొమ్ము ర
మ్మతివా! నామతివాంఛఁ దీర్తువది మేలాలంచి లాలించవే. 71

తే. అనినరాగంబుసిగ్గుమోహాతిరేక, మాభిజాత్యంబు సమ్మోదమతిశయిల్లఁ
బోదలమాటున నెఱనీటుపొదలమాటి, మాటికినిదొంగిచూచుచు మగువ పలికె. 72

మ. గురుపత్నీరతుఁడా సుధాకరుఁడు మీకూటస్థుఁడౌ నా బలీ!
సరసాగణ్యులుమీరు మీకిదికులాచారంబు పారంపరీ
పరిపాటిన్ బలుకన్ విడంబనముగా భావించితిన్ మేలు మే
ల్గురుకన్యాపరిరంభణంబునకు సంకోచంబు మీకెట్లగున్? 73

తే. నట్టడవిలోననన్నిట్టునట్టుపఱిచి, గొట్టుమిట్టాడ నేటికిఁ బట్టభద్ర!
పుట్టునకుమున్న లేమకు బొట్టుగట్టి, చెట్టపట్టుట కొకరుండు పుట్టఁడావె. 74

శా. నాకున్ జనకుండెఱుంగనివిధానం బెట్టు గావింపనో?
లోకుల్ మెచ్చరు మిమ్ము మానితనయాలోలాత్ముఁ డండంచు సు
శ్లోకుండైతగు తాతకశ్యపుఁడు పచ్చున్ మెచ్చు నిచ్చున్ ననున్
మీకున్ నాకు సరోరుహాసనుఁడు బల్మిం గూర్చిన ట్లైనచోన్. 75

తే. అకట! గుడమిశ్రమగు పాయసాన్న మేని, నుడుకుఁ జాఱినరుచ్యమైయుండు టెట్లు?
తారతమ్యంబు భావించి తరతమంపు, మేలుఁ గైకొమ్ము కరుణనన్నేలుకొమ్ము. 76

వ. ఇవ్విధంబున. 77

తే. అధిపుఁ డాలించియాలించి యభినుతింప, రమణి మందాక్షమందాక్షరంబుగాఁగ
మొలకపలుకులనమృతంబుఁ జిలికిచిలికి, చకితచకితాంగయష్టియై సంభ్రమించి. 78

క. ఉత్తరముం బ్రత్యుత్తర, ముత్తమముగ నిటుల నడపి యుత్తరమాపై
నెత్తక చెలిమరలేఁ దదా, యత్తఁ జిత్తమున మెత్తనగుచున్ నగుచున్. 79

ప. అయ్యవసరంబున. 80

మ. కలకంఠీ! వరవర్ణినీ! మదవతీ! గంధేభకుంభస్తనీ!
జలజాక్షీ! మృదుభాషిణీ! శశిముఖీ! శాతోదరీ! సుందరీ!
యలివేణీ! రమణీమణీ! కలికీ! తన్వంగీ! మనోహారిణీ!
లలనా! మెచ్చుటనొంటినుంటివని గోలం జేరరా శీఘ్రనుల్. 81

వ. తదనంతరంబ. 82

ఉ. కించిదుపజ్ఞ నాత్మఁ బరికించి తదాననచిహ్నముల్ విలో
కించి తదీక్షణంబు పరికించి తదంతరుదంతమున్విత

ప్రతీ
మసి పగ వెల్. 102
ఐగపంపునడ బెళుకున

గ్రక్కించి తదంగయష్టిపులకించి విరహించుటఁ జూచిచూచి శం
కించి భయంబుగూరఁ దిలకించి ప్రియంవద లేమకిట్లనున్. 83

ఉ. తోరముసైన నవ్వుఁ బోదలఁదూలఁగనీనకలాంగకమ్ములె
ట్లోరిచెనమ్మ! భృంగములయుద్ధతి నీవదనారవిందమే
తీరునవైఁచెనమ్మ! విరిదేసెలసోనలరొంపులెల్ల నీ
వేరహి దాఁటితమ్మ! యిటులేకతమేకతమే తలోదరీ! 84

ఉ. నవ్వులు గావు నీదువదనంబునవిన్నఁదనమ్ము హేతుకం
బెవ్విధి సంభవించె? నిటులెవ్వరు నీకహితమ్ము చేసి? రే
యెవ్వమిలేదు నావలననొక్కయెడక్షమము బుజ్జగించి నీ
విప్పనవీథి నివ్వటిల నేమికతంబు? నితంబినీమణీ! 85

వ. అనిన నక్కన్యారత్నంబు కొంచెశోకభావించి కించిదంచితలజ్జాసజ్జితవ్యాజలజంబుగాఁ
బ్రియంవదతో నిట్లనియె. 86

ఆ. మేలుదలఁచికొంటివాళిశిరోమణి!, వింతలేనియాపులింతగలదె
చెలియ తెలియపినుము చిత్తదౌర్బల్యంబు, దీఱఁగలతెఱంగుఁ దేఁటపఱుతు. 87

మ. లలనా! ఘూలలనాపరుండొరుఁడు కేళాకూళికామాళికా
కలనాపుష్కలపుష్కరప్రకరచంగద్భృంగచంగాంగనా
కలనాదామృతవీచికావలనజాగ్రచ్చిత్తచక్రాంగుఁడై
యలనాళీకశరుండునుంబలెఁ బ్రమోదాపాదియయ్యోక్షరహీన్. 88

క. పేరన దుష్యంతుండఁట, కౌరవబాంధవుఁడు నాగ్రగణ్యుండఁట క
ణ్వారాధనకుతుకమున నిం, డారఁగ వచ్చెనఁట యేతదాశ్రమమునకున్. 89

తే. అతనియెడనొక్కయపరాధమాచరించి, చింతిలుచునున్నదాననో చివురుఁబోణి!
చేతివిరిబంతిచూచాయఁ జిలుకనేయఁ, దప్పియారాజువక్షంబు దాఁకెనదియు. 90

వ. అనినం బ్రియంవద భయంబోదవ నమ్మదవతిం జూచి. 91

మ. లలనా! మవ్వపుజవ్వనంబుతతిబాలత్వంబుతత్త్వంబుగా
నిలుపంబాదృశుఁడీదృశక్రమముదానిందానిగర్హించినం
బలుగాకుల్ బలుగాకుసేయుదురు సెప్పంజెప్ప నిట్లొప్పముల్
దలపంబోలునె? రాజరాజతఁడు మేలమ్మేలె? హేలావతీ! 92

తే. తాతకణ్వుఁడరుగుచుఁదరుణినీవు, నేమువినునంత దుష్యంతుఁడిటకువచ్చు
నర్ఘ్యమిచ్చుకరాథింపనతని పెంపు, తెలియదఁటె? తల్లి! హేలావతీమతల్లి! 93

గీ. శీతలజలావగాహాకేళి విగులనాడి ప్రియంవద రాజుపాటికేళి
నేయుటకునెట్లు దుష్యంతుల సత్క్రియలం బ్రియమాచరించి యు

ట్లనియె వసుంధరాధరశశాంక! విశంకటవృత్తి నిత్తఱిన్
గనుఁగొనఁగంటిమాశ్రమని కాయశుభాయకునిన్నుఁ గన్నులన్. 94

తే. పాలవంటిమిలంబునఁ బరఁగుసోముఁ, డమ్మహామహుసంప్రదాయమునఁ గీర్తి
నెసకమెసఁగెడునాదిగర్భేశ్వరుండ, వతిథివైతివి పావనమయ్యె వనము. 95

వ. అని బహుప్రకారంబుల నభినందించి మఱియు ని ట్లనియె. 96

ఉ. ఇంతి యదల్పఁగా బెదర కిట్టటు గ్రుమ్మరు చిల్కమీఁదఁ బూ
బంతి తటాన వైవ గుఱి వాసి యయారె! దయారసార్ద్ర! దు
ష్యంతమహీప! నిం దవిలె శాంతి మెయిం గరుణింపుమయ్య! య
శ్రాంతమహాపరాధములు సైఁప భవాదృశు లర్హు లిమ్మహిన్. 97

వ. అని యివ్విధంబున క్షమాపణంబు లగువాక్యంబులం దన్నుఁ బ్రార్థించునక్కన్యాసహచరిం జూచి యజ్ఞానకృతం బగునీకార్యం బనార్యం బని కోపింప నంత వడంగుల మె యది యట్లుండని మ్మికాశ్యపు లూర్ధ్వరేతు లగుట జగత్ప్రసిద్ధం బై యుండ నివ్వనంబున నీజవ్వని నివ్వటిలం బనియేమి? యిక్కామినివృత్తాంతం బంతయు విన వలతుం జెప్పు మనిన నమ్మహారాజుతోఁ బ్రియంవద యి ట్లనియె. 98

సీ. అలగాధిసుతుఁ డాగ్రహగ్రహావిష్టుఁడై యాశిష్టుల గెల్వ నలవిగాక
పరవిబాహుబలబాహుబలమున గ్రహించుచు బ్రహ్మర్షిభావంబుఁ బడయఁ గోరి
హిమవదుత్తరతటాశ్రమసీమ నివసించి దృఢతరనిష్ఠాగరిష్ఠుఁ డగుచుఁ
దపమాచరింపఁ దద్దారుణానలశిఖల్ కడుకొని సభ మెల్లఁ గలయఁ బ్రాఁక

గీ. దివిజసంఘంబు భయమున దేవవిభుని, నుఱుకు సొచ్చిన నమ్మహామహుఁ డదాని
విఘ్నమునకు నుపాయంబు వెదకి మేన, కాహ్వయముఁ దాల్చునచ్చరగనామలెంచి. 99

శా. విశ్వామిత్రతపఃప్రభావకలనావిర్భూతఘోరాగ్నిచే
విశ్వంబెల్లఁ దలంకుచున్నయది నీవిన్నాణమున్ జూపుచున్
విశ్వాసంబొలయించి యమ్మునితపోవిఘ్నంబు గావింపుమీ
శశ్వత్కీర్తివహింతు వీవు ధరనాచంద్రార్కముం గోమలీ. 100

చ. అనవిని మేన విన్ననయి యారసి యారసి కాపతంసుతోఁ
గనుకనిఁ బల్కె గోపనుఁడు గాధిజుఁ డాధిజనింపఁ జేసెడిన్
గనివిని మీరుపంపఁ జనఁగావలెఁ గావలె సత్సహాయముం
బనుపనగున్ సమీరణకుమారుని మారుని నమ్మధున్ విధున్. 101

వ. అనినఁ బ్రీతుండై పురుహూతుం డి ట్లనియె. 102

క. కంతుం బంతున్ రజనీ, కాంతుం బంతుం బ్రమోదకరు గంధవతీ
కాంతుం బంతున్ మొల్లల వ, సంతుం బంతున్ లతాంగి! చనుమని పనిచెన్. 103

తే. అట్లు లాలించి పనుప నయ్యబ్బలరుఁబోఁడి, యుడుగుతళుకున మునివంపునడబెళుకున

గ్రామ్మెఱుఁగులీల రాయంచకోదమభాతి, వెడలెఁ దెఱగంటివేలుపుఁ గడిఁదిప్రోలు. 104

ప. అట్లు వెలువడి శీఘ్రగమనంబున. 105

సీ. సురసరిత్పరిసరస్ఫురదురస్సరపుర స్సరదురుత్తరమరుత్తరువరంబు
దినదినస్తనితనిస్వనకనన్మునిమనః పనితనూతనఘనాఘనఘనంబు
కలభకేటక్కులచలచ్ఛలదలస్థలదల ద్దలమిలజ్ఝలఝలజ్ఝలఝలంబు
ప్రపణపజ్జవనవత్ప్లవనవన్నపనవ శ్రవణవత్స్వపనవిప్లవపదంబు
తే. గజగవయగండభేరుండఖడ్గచమర, శరభశార్దూలశంబరశల్యవృకవ
రాహసింహావళీముఖప్రముఖదుష్ట, సత్త్వసుఖరంబుఁ గనియెఁ దుషారనగము. 106

ప. కాంచి విస్మయావేశంబునం దదుత్తరతటంబునం బ్రవేశించి. 107

క. అందుం గల కందువలకుఁ, గందళితంబగుచు హృదయకమలం బలరన్
సుందరమునిమందిరమగు, చుందిరమగు నాశ్రమంబు జొరఁ జొర నెదుటన్. 108

సీ. తపము పెంపునఁ దోఁచు దహనకీలములతో జటిలంబులగు పల్లజడలవానిఁ
భసితాంగరాగసంపదలసొంపెసలింపఁ దగు వళీవలితగాత్రంబువాని
మైఁ బుట్టుపుట్టకోమలచీమలెగఁబ్రాకి మార్పనేర్పదని లోమములవాని
వ్యాఘ్రాజినోత్తరీయము మేనిచాయగా బలుమోగంబునఁ దోఁట్రపడుచువానిఁ
తే. కందమూలాదికాశనకాయశోష, [illegible]ష్టాంగసంగతయోగభాగ
పావనబ్రహ్మఋషిభావభాసనాప్ర, తీతదీక్షావిధేయుం గాధేయుఁ గాంచె. 109

ప. ఇత్తెఱంగున నతిఘోరతపశ్చరణపరిణతదీక్షాలక్షితచరిత్రుం డగు విశ్వామిత్రుఁ గాంచి
తత్తేజోవిశేషంబునకు సాధ్వసంబు కొట్టింప నన్నిలింపగణికాలలామంబు. 110

క. కనుఁగొను గనుకొని మునుకొను, మునుకొని మునుకొనక వెనుక ముందై కుందున్
మునుతనువని చిసపనికిం, గొనకొనుఁ గొనకొనదు తపసి కోపముఁ దనుచున్. 111

ప. వెండియుం. 112

ఉ. ధూనితపత్రప్రభావమున ధూవలయంబు నభంబుఁ బ్రాఁచుచున్
జేరను జెందనుం బ్రణతి సేయను శక్యము గానివానినే
నే రహి మారుబారికిలయింపుదు నట్లని ప్రోలుక్రమ్మరం
జేరిన వాసవుం డలుగుఁ జింతితకార్యవిపర్యయంబుగాన్. 113

తే. అమరనాథుండు లోకహితార్థమనుప, శక్తియుక్తులనదివ్వాని సంఘటింపఁ
బిదప నెట్లైనఁ బేరును బెంపుఁగలుగు, దవ్వుదవ్వుల వెఱఁవులానితలగుటెట్లు. 114

తే. అనుచుభావించి భావించియులరుఁబోణి, గాఢనిశ్చయమున మనగళమల మలరఁ
జెలులుఁ దానువిలాసవిచేష్టితముల, గాధిజునిమ్రోలఁ గ్రీడించెఁ గలితనమున. 115

సీ. నృత్యన్మయూరికానికురంబమునఁ జేరి నగుచు నృత్యము సేయు గంధ
భావన్మరాళికాతల్లజంబులఁ జేరి గతులవైఖరిఁ జూపుఁ గలువకంటి

ప్రతిపదశారికాపరికరమ్మునఁ జేరి మధురమ్ముగాఁ బల్కు మంజువాణి
కూజద్ద్విరేఫికాకులకమ్ముజతఁగూడి శ్రుతివిభాగ మొనర్చు సుందరాంగి

తే. సవిధమధుమాసవాసరోత్సవవిశేష, లసదలంకారముకుళపలాశకుసుమ
ఫలభరానమ్రపాదపపటలజటిల, గాధిజాశ్రమసీమశృంగారగతుల. 116

వ. ఇవ్విధంబునఁ గొండొక పరిభ్రమించి. 117

మ. కొలఁకల్ దాను సుగాఢగాహలములన్ నీరాడి కైసేసి త
త్పుళినస్థానమునందుఁ గ్రొవ్వలపుగాడ్పుం గూన పైపీవఁగా
లలిఁ గూర్చుండి విపంచికారణనముల్ రాజిల్ల నయ్యప్సరః
కలకంఠీతిలకంబు సేయఁదొడఁగెన్ గానం బనూనంబుగన్. 118

క. వీనులవిందై నెలకొను, గానామృతమాని మానెఁ గౌశికుఁడు నిజ
స్నానంబున్ మానంబున్, ధ్యానంబున్ మొదలుకొను విధానంబెల్లన్. 119

వ. ఇట్లాలించి యాత్మగతంబున 120

క. కాదంబకులఝంకారము, కాదలకోకిలరుతంబు కమనీయసుధా
సోదరమిన్నాదరసం, బాడఁగణీయముయదె యమనికను దెలిచెన్. 121

వ. ఇట్లమ్మునికులాగ్రేసరుండు నిమీలితలోచనుండై నలుగడలం జూచునవసరంబున. 122

ఉ. సోముని లేమఖాతిఁ బరిశుద్ధసువర్ణశలాకచాప్పునన్
కోమలకల్పవల్లివలె గుమ్మనుకుంకుమబొమ్మకైవడిన్
గాముని హేతిరీతిఁ దొలుకారుమెఱుంగుతెఱంగునన్ లతాం
గీమణి దోఁచెఁ గట్టెదుటఁ గేవలమున్ వనదేవతాకృతిన్. 123

ఉ. ఆసమయంబునన్ మదనుఁ డగ్గలికం గళికాముఖాంబులై
భాసిలుతూపులన్ హృదయపద్మము లక్ష్యము సేసి యేసినన్
గాసిలి కౌశికుండు తమకంబునఁ దన్ గనుసన్న చేసి యు
ల్లాసము వెల్లివీఁగ సఖులన్ నిలువన్ నియమించి గ్రక్కునన్. 124

మ. పలుకుల్ దేనియ లూరఁ గౌనునుఁ బయిం బాలిండ్లపొంగారఁ బొం
దళుకుం బయ్యెద జాఱ వేణిపొరలన్ దాటంకరత్నద్యుతుల్
తులుకుం జెక్కులఁ జేరఁగన్నులబెడంగుల్ మీఱ నయ్యప్సరో
లలనారత్నము వచ్చి గాధిజుని మ్రోలన్నిల్చె నమ్రాంగియై. 125

ఉ. అంచితభక్తియుక్తి వినయమ్మెనయన్నును గేలుదోయిఁ జో
డించి నమస్కరించి నెఱతీవి దలిర్పఁగ మ్రోలనిల్చినన్
గాంచి మహామహుండయిన గాధితనూజుఁడు కూర్మిపేర్మిదీ
పించి లతాంగి! నీ వెవతెవే ధృతి వేకలఁగెన్ నిమంగసన్. 126

వ. అని సాభిప్రాయంబుగా నడుగుటయుఁ బమ్మదమ్మున సమ్మదవతి యమ్మునితో నిట్లనియె.

క. మేనకయని పిలుతురు నను, మానినులాగ్రణి! తిలోత్తమాహేమాదుల్
నా నెచ్చెలు లేమచ్చర, చానల మెం దేని వేడ్క సలుపుదుము రహిన్. 128

క. ఎక్కడిమీ రెక్కడి నే, మెక్కడి రతి పరమమునుల కివియుం గలవే ?
మ్రొక్కెడి దీవించుటకై, యెక్కటిరా నిట్లు పలుక నెల్లిదమైతిన్ 129

క. సామాన్యలఁ గా మమ్ముం, గామింపకుఁ డేము నూటుక్రతువులవానిం
గా మోపభోగములకుం, గామింతుముసూ నిజంబుఁ గనుఁగొనుమనఘా! 130

క. పావనభవదంఘ్రిద్వయ, సేవనముచు విమలకమల శిశిరనభస్వ
త్సేవనముఁ దొరఁకొనుసిట, నీవనమున మెలఁగువార మీరలుగ కుఁడీ 131

తే. అనుచుఁ బ్రతికూలవాక్యంబు లతివపలుకఁ, జిలుకబాబావజీరుంపు చిలుకుములుకు
టలరుటంపఱ తాఁకుననలసిసొలసి, ధీరవర్తన మెడలి ప్రార్థింపఁ దొడఁగె. 132

సీ. తళిపివెన్నెలవేఁడి తలఁకించెఁ గటకి! నీ యధరాధరామృతం బానసిమ్ము
వలపుఁ జెమ్మెరకూన వడఁకించె మగువ! నీ కళుకుపైఁట చెఱంగుఁ గప్పనిమ్ము
విరికటారపుజోదు వెఱపించె వెలఁది నీ కుచదుర్గములహత్తుకొనఁగనిమ్ము
పికశుకనికరమ్ము బెదరించె నతివ! నీ సాహాయ్యమునఁ గేలి సలుపనిమ్ము
గీ. జలదళఫలానిలాహారసదుపవాస, చిరతరవ్రతదీక్షావిశేషశుష్క
దవయవాయాసమున బావ మలసమయ్యె, బాలనీ మ్రోల శుశ్రూషఁ బడయనిమ్ము. 133

వ. అని యనేకప్రకారంబుల. 134

శా. ఈవాడం గరఁగించుచున్ గృపణుఁడై హేలావతిన్ వేఁడుచున్
జేఁజేతం దెమలింపఁ జూఁచి హసితస్మేరాననాబ్జంబుతోఁ
గూజన్నూపురఘంటికావళులతో ఘుమ్యన్మరాళీగతిన్
రాజీవాననయిట్టటుం బెనఁగె దూరం బైనబీరంబునన్. 135

క. మెలఁగున్ దలఁగున్ భయమునఁ, గలఁగున్ మలఁగున్ లతాంగి కపటారభటిన్
జెలఁగున్ వలగొను నెనరున, నలఁగున్ దొలఁగున్ నగు న్వయారము మీఱన్. 136

వ. ఇట్లు మునిగృహీతం బగు నిజకరాబ్జాతంబు సడలించికొని శరీరంబులయారంబులను, దమాలంబులయాలంబులను, లవలీకుంజంబుల పుంజంబులను, ద్రాక్షాకాయమానమ్ముల వితానమ్ములను, దిలకమ్ములకులకమ్ములనుఁ గాసారంబులతీరంబులను, గిరితటంబుల నికటంబులను బరిభ్రమించుచు నెక్కువంబునఁ జేఁజిక్కక చిక్కులఁ బెట్ట నెట్టన గాధిపట్టి యిట్టట్టుఁ జుట్టివచ్చి చెట్టఁ బట్టి పట్టుపఱచుచు నిట్లనియె. 137

కవిరాజవిరాజితవృత్తము.—
కలఁకలు సేయకువే కలికీ నుడికైకొనవే మరుపూములికీ
కొలఁకులఁ గ్రుంకకువే యబలా మదిఁ గొంకకువే ధృతకామబలా

కొలఁకులఁ డాఁగకు వే లలనా! వెదకింపకు వే కనుఁగోఁగలనా
సిలుగులఁ బెట్టకు వే రమణీ! ననుఁ జేకొనవే గుణహీరమణీ! 138

తే. అనుచుఁ బ్రార్థించి దోహ్హదం బవధిగాఁగఁ
గూడియుండుట కొడఁబడి కుసుమగంధి
సంయమీంద్రునితో వచ్చె సహచరీసు
కల్పితంబైన కిసలయతల్పమునకు. 139

వ. ఇట్లయ్యప్సరోలలనామణిహస్తంబు నిజహస్తంబునం గీలించి యనల్పకల్పితానల్పం బగుకిసలయతల్పంబుఁ బ్రవేశించి తపఃప్రభావంబునం దనరూపం బగురూపంబు గైకొని మన్మథరాజ్యపట్టాభిషిక్తుండై విశ్వామిత్రుండు. 140

సీ. లోఁగుపైఁటచెఱంగుఁ దొలఁగించి తొలఁగించి యొదుటుగుబ్బలగోరు లూనియూని
బిగువుఁ గౌఁగిటిలోనఁ బాగయించి పాగయించి సవురుగా మైఁదీవ పిసికి పిసికి
కదిసి మోమున మోముఁ గదియించి కదియించి యలమి వాతెఱ తేనె లాని యాని
కేళిమైఁ దమకంబుఁ గెరలించి కెరలించి కళలూర మరుకేళిఁ గలసి కలసి
గీ. సొలసి సొలసియుఁ గ్రమ్మఱ ననఁగి పెనఁగి, యొదలబడలిక వాయ నయ్యువిదనేగుం
నంగసంవాహనంబున నలరియలఁ, గడపె నారాత్రి సుఖతుఁడై కౌశికుండు. 141

వ. ఇవ్విధంబున. 142

క. సురతరుపరికరధరణీ, ధరవరశిఖరస్థలీలతాభవనమునన్
నిరతరతరాగంబున, సురతరుణిం గూడి మౌని సుఖమున నుండెన్. 143

తే. అంతఁ జలచలపిదపిదమనుచు నసిచి
కలలఁ బైవిప్పు వాఱుచుఁ గరుపు గట్టి
తలదలిర్పఁగ గర్భమై తరతరంబ
నెలమసలెఁ జీరచిక్కె నన్నెలఁత కధిప! 144

వ. ఇట్లు గర్భంబు నవమాసపూరితం బగుటయు. 145

క. రాజర్షివలన నిర్జర, రాజవధూతిలకమునకు రమణీయంబై
రాజిలులగ్నంబున నీ, రాజానన గలిగె ఖచరరాజి నుతింపన్. 146

వ. ఆమ్మేయి నమ్ముని నెమ్మనంబునం బమ్మినసమ్మదమ్మున నక్కూఁతునకు జాతకర్మాదిసంస్కారంబులు నిర్వర్తించినం గాంచి యమ్మత్తకాశిని మెత్తమెత్తన నత్తపోధనుచిత్తం బారాధించి ప్రథమాధిగమంబునం జేసికొన్న సంకేతంబుఁ దెల్పించితి నింక యథాకామంబుగా వర్తింపంగలదాన నట్లగుట నాశ్రితరక్షావిచక్షణంబు లగుకటాక్షవీక్షణంబుల నన్నుం గృతార్థంగావించి వీడుకొలుపం దగుసని సప్రణయంబుగాఁ దచ్చరణంబులకెఱఁగి పాత్రికల నత్తమిల్లినయయ్యుత్తానశాయినిం దనపాదింగిట నిడుకొని సవినయంబుగా సన్నిధి నిలిచియున్ననరుస్తటీతిలకంబు దెసం దేఱి చూచి యట్లకాక

యనుచు నొడంబడి తత్కరతలంబుల మణిశలాకికాకారంబునం బొదలుతనయం దనయంకతలంబునకుం దిగిచికొని బాష్పాకులలోచనుం డగుచు మూర్ధఘ్రాణంబుఁ జేసి ముంగేల చిబుకంబు నిమురుచు మేనకం జూచి యిక్కన్యచంద్రాన్వయప్రదీపకునకు నగ్రమహిషియై చక్రవర్తిలక్షణలక్షితుం డగుకుమారుం బడసి చతురుదధివేలావలయితసామ్రాజ్యసౌఖ్యం బనుభవించుచు నుభయకులంబులకుం గీర్తిపౌరుషంబులు సంపాదింపంగలయది యట్లగుట బహుప్రయత్నంబున దీని సురక్షితం గావించునది యని క్రమ్మఱ నిబ్బాలిక నమ్మేనకకు నొప్పంజెప్పి గాఢాలింగనాదిసత్కారంబుల నుపలాలనం బొనరించి యయ్యచ్చరవాల్గంటిం బ్రియంబున వీడుకొల్పి తానును యథాపూర్వంబుగాఁ దపోనిష్ఠాగరిష్ఠుండై యుండె మేనకయుం బ్రియపుత్త్రింగైకొని యాతదాశ్రమసమీపంబుఁ బ్రవేశించి. 147

చ. పొనుపగు మాలినీసలిలపూరము చేరువఁ జారుసైకత
స్థలమునయిన్ సుజాతజలజాతమృదుచ్ఛదశయ్య నాత్మలో
నలుకకమూఁతుడించి విరహీనచ్చరమిన్నులు బ్రాఁకె భోగినీ
లలనలకీలపట్టుతపులం బనుసామెత సత్యపంబుగాన్. 148

ఉ. ఆదట తాతకశ్యపుఁ డమార్త్యముఖుల్ గనిమాలినీనదిం
బ్రోజజంబులాడుటకుఁ బోవఁగ నొక్కెడ నొక్కబాలికా
రోదనముస్వనంబడిన రోయుచుఁ దాసుకపాకుపాత్రికం
బోదనలేక యట్లొరలుపాపమిటానిని జూచి యార్తుఁడై. 149

క. ఎవ్వని బాలారత్నం?, బెవ్వఁడు జనకుండు? జననియెవ్వతె? జననం
బెవ్వేన? దీనిఁగొననే, నెవ్వఁడ? నెట్లనుచుఁ బ్రియ నెట్లగునడపన్? 150

తే. అనుచు సందేహడోలాయితాంతరంగుఁ
డగుచుఁ దనయోగదృష్టినయ్యర్భకనిసుఖ
పుట్టినతెఱంగుఁ గనుఁగొని ప్రోదిఁ బెనుచు
వాంఛ నూహింప నశరీరవాణి పలికె 151

క. మేనకకు గాధిజునకున్, మానుగ నుదయించె దీనిమనుపం దగుఁ ద
త్పూనుఁడు నీదౌహిత్రిం, నుభయత్రాతజనకుఁడనునుడివినవే. 152

వ. అని మఱియును. 153

క. కుంతలముఖ రాజవధూ, కుంతలకాశ్మీరదానగుణచణబాహా
కుంతలసనయశరీర శ, కుంతలయనిదీనిఁ బేరుకొనియె మునివినన్. 154

వ. తదనంతరంబ. 155

తే. పుట్టు బ్రహ్మచారి పుత్త్రమిత్త్రకళత్ర, యోగభోగరహితుఁ డూర్ధ్వరేతుఁ
డహహా! దైవఘటనమాపిన్న పాపమే, నలమికొనుచు ముద్దులాడఁ దొడఁగె. 156

వ. ఇట్లు విశ్వామిత్రతపఃప్రభావంబునం గ్రవ్యాదగోచరంబు గాక శకుంతరక్షితయై వనవలినపలాశతల్పంబునం బొరలుచున్న యక్కన్యకాలలామంబు వనపాదిఁగిటఁ బొదివి కొనివచ్చి పర్ణశాలం గుశాస్తరణంబునం బసిలంబుగ నిడి యథాశక్తిం బెనుచుచున్నం దెలసి యదితియుం గశ్యపప్రజాపతియును నమ్మునననసూయయునుం దక్కటి పరిచారికా జనంబునుం బనిచిన నేమునుం గులపతిం గాంచి తదనుమతిని కాంచనగాత్రిం బెనుచుచున్నవాఁడ మిదియిక్కలికి జన్మప్రకారంబు. 157

చ. ఆనవిని భూమిభుజుండు దరహాసవికాసవిలాసభాసురా
ననవనజంబుగాఁ బలికె నాతిప్రియంవదవే నిజంబుగన్
జనవ్రననింపునింపుచును సారెకు సారెకు ధీరశ్లోణిం
బనిగొని పల్కుపల్కుల సభాజనభాజనమయ్యె డెందముల్. 158

తే. అనుచు మునికన్యకావృత్తమలిప తెలుప, వినుచునానందరసమున నిభుఁడు మెచ్చ
నట్టియెడఁ గర్ణతాడితంబయ్యె బహుళ, హళహళంబగు వాహినీకలకలంబు. 159

వ. అయ్యవసరంబున. 160

ఉ. సైనికసింహనాదములు సామజబృంహితముల్ తురంగ హే
షానినదంబు వక్రరథచక్రపరిక్వణనంబు ఘోరమై
వీనులఁ గ్రమ్ముదేరఁ జెలి వేమఱలెన్ మఱలెన్ సఖీజనం
బానరనాథుఁడున్ మఱలె నాశ్చర్యయానినివేశనాగ్రయై. 161

వ. ఇత్తెఱంగున నాశ్రమంబు వెలువడి నిజసైనికులకుం బొడసూపి తదాశ్రమంబునకు సమగ్రంబుగాకుండునట్లుగా నిజస్కంధావారంబు విడియింపం బనిచి తన్మధ్యంబునం బటకుటీరం బెత్తించి విచిత్రాస్తరణశోభితంబును బ్రలంబమణిమాలికాలంకృతంబును గృష్ణాగరుధూపధూపితంబునునై మనోహరంబగు నప్పటమండపంబునం గిసలయతల్పంబునం బవ్వళించి యమ్మునికన్యకాసమాగమోపాయంబు దొరకొనక మనోజవేదనాదోదూయమానమానసుండై కొండొకదినంబులం గడుగడపుచుండె నంత నక్కడ. 162

క. ఆనరనాథుని చెలువము, మానసమునఁ బాదుకొనఁగ మానిని సఖులుం
దానైయుద్యానంబున, సూనాపచయంబు సేయుచున్ విహరించెన్. 163

వ. అయ్యవసరంబున. 164

ఉ. తమ్ములతావితానములఁ దావలమైపలమైనగాడ్పుతో
యమ్ముల కామలింపఁ జటులాలసలై వనకేళి సేయఁగాఁ
దమ్ములతావితానములఁ దావలమైవలమైన గాడ్పుతో
యమ్ముల కామలింపఁ జటులాలసలై వనకేళి సేయఁగన్. 165

ఉ. గమ్మనుతమ్మి నెమ్మొగము కల్వలు కన్నులు కప్పువిప్పులం
బమ్మిననాఁచు కొప్పు నెడఁ బాయని జక్కవ గుబ్బచన్నులుం
గమ్మని తేనె మోవి బిసకాండభుజమ్ములు నొప్పు మీఱఁగాఁ
దమ్మునఁ బోలి యొప్పు నొకతమ్మి కొలంకుపు గాంచి యచ్చటన్. 166

తే. కొమ్మ లందఱు రతనంపుసొమ్ములూడ్చి, సూనభుజములఁ సోకినసొలపు మేను
లమరఁ గంటలుదీసి దుమ్మాడిసట్టి, మరుని మడమేనుఁగులరీతి సరసిఁ జొరఁగ. 167

చ. అడుగులనంటి యూరువుల నాసి పితంబముల నందినాభిసిం
బుడికి పయిన్ స్పృశించి కుచముల్ ఎడిముట్టి సరోవతంసమ
ప్పడఁతులఁ గూర్మిఁ గాసివలెబం[illegible]కంకణకర్ణికావళిం
దడవుచు నిల్పికై కొని యొఁ దన్మయతం బ్రతిబంధవైఖరిన్. 168

సీ. ఒకతేమ వలిగుబ్బ నొగి మృణాళముఁ జుట్టి తారుణ్యకలశాబ్ధిఁ దరుచు నొకతె
యొకచాన కనుబెళ్కులోలయూర్ములు గట్టి పాయలుగాఁ జేయూఁతలూను నొకతె
యొకతన్వి మృదుహస్తము ఁ బియప్పుల దొట్టి పద్మానుభావమేర్పఱచు నొకతె
యొకచామ లసదూరు పుదపుష్కరమున మెట్టి మకరేఖకలహంబు మనుచు నొకతె
గీ. యొకలతాంగి నిజేయూఁత నోటుపఱచి, వీనులంటిజముశ్రీల నీను నొకతె
సఖులు దాను శకుంతల జతలజతల, నతులగతులజలక్రీడలాడునపుడు. 169

క. వేడుక మీఱఁగ జలకము, లాడి సరోవరము వెడలి యన్యోన్యంబున్
దోడయి కైసేసి జల, క్రీడాలసలగుచు నలవరించిరి తొడవుల్. 170

చ. కులుకుమిటారిచన్నుఁగవఁ గుంకుమసంకుమదాను లేపముల్
దళుకులప్రోఫ నెన్నుదుటఁ దామరసోదరరేణుచిత్రకం
బళుకులవేణి వేణి నవహాటకపింజరమంజరీతతిన్
గలిసి పసాళికన్నుఁగవఁ గజ్జలముల్ రచియించి రచ్చెలుల్. 171

చ. పొలుపుగ జాళువాపసిఁడిపుట్టము గట్టి జగానిగారపున్
మెలఁపుల పైఠిణిం దొడగి మేనిమెఱుంగుల తారహారిన
స్థలవలయాదిభూషణకదంబవిడంబన ముల్లసిల్లన
త్తిలకిని యొప్పుమీఱె నసిదీరినమారుని వాలుపోలికన్. 172

వ. ఇవ్విధంబున నలంకృతలై. 173

ఉ. తామరసచ్ఛదంబున ముదంబున వ్రాసిరి చేసిరి న్నెఱిన్
గాముని కామనీయమను గాదినిచిల్కహౌమాసుమాళముల్
సోముని సౌమనస్యమను జొక్కలరుక్కలనంబు చందనా
రామలలామశైలశిఖరస్ఫురదాతతవాతపోతమున్. 174

ఉ. ఏటికి వచ్చె భూమిపతి యీవననాటికి? వచ్చెఁ గాక నే
నేటికిఁ బూలబంతి నటు వేసితి? వేసిన నేమి గూఢునిం
డేటికి నన్నుఁ దావలచి యింతలు ప్రార్థన చేసెఁ? జేయ నే
నేటికి వాని లోఁ గొనక వెల్లిడ మైతిని మారుబారికిన్? 184

క. అనుచున్ వలుగెలఁకులుఁ గనుఁ, గొనుచున్ దనుఁ దాన సిగ్గుపడుచున్ మోఁ గ్గనుచున్
గ్గనుచున్ సారెకునుసురను, రనుచున్ జెలులపహసింతురని వెఱఁ గొనుచున్. 185

వ. ఇట్లు నెలంత బలవంతంబగు పలవంతం బొరలు నవసరంబున. 186

చ. పులుఁగులు గూండ్లఁ దూఱె నిగుబోణులయుల్కలు దీరె భానుఁడో
పలములఁ గాఁ కలాఱె నినుఁ బశ్చిమశైలముఁ జేరె దిక్కులన్
దలమగు నాఁక దేరె రతినాయకుఁ డమ్ములనూరెఁ దమ్ముల
గ్గలముగ వాసెఁ బారె విరికల్వలు లేనియలూరె నత్తఱిన్. 187

చ. కరమనురక్తుఁడై పురుషకాంతి వహింపక భర్త చల్లనౌ
కరముల బుజ్జగింప వినఁగానక పద్మిని మోముఁ వాంచె నౌ
కరమనురక్తుఁడై పురుషకాంతి వహింపక భర్త చల్లనౌ
కరముల బుజ్జగింప వినఁగానక పద్మిని మోము వాంచునే? 188

సీ. ఖరకాలకరవాలఖండితవాసర కాసరస్కంధచక్రంబనంగ
సముద్రచరమవిశ్వంభరాధరశిఖా పరిపక్వదాడిమీఫలమనంగఁ
బశ్చిమాశావధూపటుతరస్తనతట స్ఫారకాశ్మీరలేపంబనంగ
సాయంసమారబ్ధజలధిసంధుక్షణ క్షణదీప్తబడబాముఖంబనంగ
గీ. విరహిజనజైత్రయాత్రానుసరసనంగ, కేతనస్ఫీతమకరధ్వజోద్ధృతములనఁగ
నొడల నెఱసంజకెంజాయ మెఱుగులయిన పరభాగమునఁ జేరె పద్మినీబాంధవుండు. 189

మ. బలభిన్నీలశిలాకదంబములతో భద్రేభయూథంబుతో
జలదశ్రేణులతో మిళిందములతో శైవాల్యకాంకంబుతో
లలనాసంయుతకేశపాశములతో లక్ష్మీధరాంగంబుతో
నలదిందీవరపాళితోఁ జెలిమి సర్వంబర్వఁ గ్రొంజీకటుల్. 190

సీ. గగనగంగాతరంగముల తాఁకున మింటఁ దేనులుఁ బింఛీరఖండములమాడ్కి
వియదలత్తాపింఛవిటపచ్ఛటానట జ్యోతిరింగణగణద్యుతులభాతి
శివతాండవక్షణోత్క్షిప్తగగనమునందు నెలకొన్న చిఱుతవన్నియలపగిది
రాజమార్గమునది గ్రామాశిరోమణుల్ చల్లు నాచారలాజలవిధమున
గీ. యామినికిసోమునకు వివాహమునఁ దనరు, చలువపందిటిముత్యాలసరులసరణి
విష్ణుపాదముఁ గై సేయు విరులపోల్కి, గలిమి వాటించె మొలకచుక్కలబెడంగు. 191

ఉ. ఘోరతరాచ్ఛభల్లవనకుంజరపేచకచిత్రకాయమా
ర్జారవిహారవేళలనుశంకదలంకకజాలచోరుని
చ్చారుచిరప్రవర్తనలు సల్పఁ దొడంగిరి జాంగిలంబులం
దారయ వేమఱుం గనక మర్కట ప్రాణముఁ గొంచెఁ దియ్యనా. 192

వ. ఆసమయంబున. 193

చ. స్ఫుటతరనవోత్పలద్యుతులు చొప్పడ యామిని కామినీధవ
మ్మరహారమూర్తిగా యమమయూఖలు వెన్నెలపుల్గువేలుపుం
దొరలకొసంగఁబూనినపియూషసుధాకలశంబుచాడ్పునన్
సరసకళావిలాసరససాంద్రుఁడు చంద్రుఁడు తోఁచెఁ దూర్పునన్. 194

చ. కుముదినిసొంపెసంగె బద్మినులగోము దొలంగె నభస్థలిం జకో
రములు చెలంగెఁ గోకనికరమ్ము గలంగె పథుండు పూర్వభా
గమున వెలింగె నంబురుహకాంతుఁడు కాంతి దొఱంగె నౌర! లో
కము తనమేలుగాంచుఁ దలఁచుఁగా నహితపరాభవంబిలన్. 195

సీ. అంగభూనవమల్లికాస్త్రప్రసారంబొ? రోహిణీజనతనూరేలసనంబొ?
కమనీకమలసత్కముదినీహాసంబొ? పక్వరవంజీవపాయసంబొ?
ప్రవజందమణిగణసారసీసారంబొ? క్షణదాభిసారికాస్తరపటంబొ?
తారణీతరణోత్సవసూనవష్టంబొ? నెయ్యపుమిక్కిలిశాబ్ధికసవంబొ?
గీ. యనఁగ బ్రహ్మాండమండపాభ్యంతరమున, బాలగారయొనర్చనలీలనెఱసి
పుడమిఁ దారఁ బోసినపాలుపు పిండి, పండు వెన్నెల నిండె దిక్కండలమున. 196

క. కంకపరిశోధునికరములు, శ్రీకాంతాసుత విచివృసుఖీకిరలగలిక్
దాఁకఁగఁ జేతులనొడ్డుచు, నాకొమిరెమిటాగకలికియలు ఝిలెంకన్. 197

ఉ. హా కరుణావిహీన! నలినాహితి! చింతలుచున్నదాన నీ
వీకడఁ జేరినన్ను నలయించెదు నీదుకులంబు కీఱగం
గాక గుణంబు పంపనగుఁగాక యొడమ్ము మలీమసంబగుం
గాక భవచ్ఛరీరము రుఖండములై చెడుఁగాక దుర్మతీ! 198

ఉ. మందరమెత్తిదైత్యుల నమర్త్యుల నొక్కటిచేసి వాసుకిన్
బందముత్రాడొనర్చి హరి పాలసముద్రము త్రచ్చఁ బుట్టితీవు మరు
ద్బృందము ప్రోవ నా భువనభీకర! నిన్ను సృజించి పాంథులన్
గ్రుందఁగఁ జేయఁగా కహహ కల్గనివారల నమ్మవచ్చునే. 199

ఉ. తమ్ములనేఁచెనో? నెఱసుదాల్చెనో? గౌరవహానిఁ బొగ్గెనో?
యమ్మకచెల్ల హాలహలమట్టిన దానినణంచి యుత్తమాం

కంటకోన్ముఖములై కడు మ్రోసెదరుగదా యాటలాయివిమీఁదు తేఁటులార
పక్షపాతముమీఱఁ బరువెత్తెదరుగదా మించుటాయిఁకమీఁదు సంచలార
గీ. యింక నెన్నఁడుమాతో డహితముఁ బూని, ముచ్చటాడరో యాడరో మోమునందుఁ
బొలయరో వెంబడింపరో పోయమరునిఁ, గూడినంత నెయిటులుపోరాడఁదగునె. 209

వ. అని యివ్విధంబున నిందుకందర్పమందానిలమిళిందశుకపికచక్రాంగమయూరవారంబు
లం దూఱుచు నంతకంతకు నగ్గలంబైన బెగ్గలంబున మఱియు నిట్లు వితర్కించు. 210

ఉ. వారక పైపయిఁ బొరలివచ్చు మహావిరహాంబురాశి నే
నే రహి నీఁదుదానఁ దుది యెన్నఁడు క్రూరుఁడు మారుఁ డేనియుం
బీరము మీఱ నేయఁడొక పెట్టున నెట్టినఁ బోవ నట్టి యా
వీఱిఁడి జీవమేటికని వేమరు వేమరు లేచుచుండఁగన్. 211

వ. వెండియు. 212

శా. నీరేజారినిదూఱిదూఱియనిలున్నిందించినిందించి ప
ల్లారుల్ మారునిఁ జేరి కేరి విరహగ్లాయత్తనూయష్టియై
యారాజానన యెడ్చె వెక్కుచు దృగంతాశ్రుచ్ఛటల్ చెక్కులన్
జారం గోకిలకాకలీస్వరసుధాసారం బసారంబుగాన్. 213

వ. తదనంతరంబ. 214

తే. ఆకలికికంత కాకలినాకలించి, చేరఁజనియారజని నిట్లు మారజనిత
తాపమున వేపమానాంగియై పొలంతి, వెచ్చనూర్పుఁగ నెచ్చెలుల్ పిచ్చలించి. 215

ఉ. అమ్మక చెల్ల! యేటి వెతలమ్మ! కనుంగవ నీరునించె దే
లమ్మ? విరాళి జాలిగొనకమ్మ! ప్రియంబున మాటలాడవే
మమ్మ? లతాంగి కిట్టుదగదమ్మ! సఖుల్ వినరాని గోప్యమే
మమ్మ? మనోగతమ్ము సెపుమమ్మ! ఘటింతుము బాలికామణీ! 216

క. రావింతుము నీజనకుని, సేవింతుము నీదుకోర్కి చేకూర్పుటకై
కావింతుము నీయిష్టము, భావింతుముమీఁది తెఱఁగు పలుకుము తల్లీ! 217

వ. అని యనేకప్రకారంబుల నెచ్చెలులు విచ్చలవిడి ననునయించి పసిండిగిన్నెలం బోని
మెఱుంగుఁజన్నుల ముస్నీరై తొరంగు కన్నీరుకనికరమ్ముల నరుణనాళీకనికరమ్ములకర
ణిం బ్రభాకరంబు లగు కరంబుల నద్దుచుఁ దిలకంబు దిద్దుచు విమలంబగు ముఖకమలం
బునం గమలుసూపుచుం దెమలు శ్రమజలలవంబులం బల్లవంబులన్ విసరుచు మాటికిం
గొసరుచుఁ జిబుకంబు నివురుచు వీనలిం దివురుచు నక్కునం జేర్చుచు మక్కువ సూ
రార్చు నవసరంబున. 218

తే. జీబిలిమిటారికొండొకసేదదేరి, ప్రాణసఖులార! నానుడుల్ వరఁగ వినుఁడు
లోననడఁచినగుట్టు నాలోనమట్టు, పఱుపరామికినింక దాఁపఱికమేల? 219

ఉ. మొల్లపుమొల్లపూఁ బొదలమొగ్గలనగ్గలమైనతీవలం
దల్లనఁ జల్లనై యొలయునందపుఁ గందపుఁ గొండగాడ్పుచే
నల్లికబిల్లికందనరునామిడిమామిడిక్రిందభూమిభృ
త్తల్లజుఁ డల్ల జాలరివిధంబునఁ బొంచిహరించె డెందమున్. 220

ఉ. నాయనురక్తిచెప్పవలెనాయని యార్యులచాటుదానఁ గా
నాయని రవ్వకోర్వఁగలనాయని గాజులపొందుగోరనా
నాయని తత్తఱంబుదగునాయని యింతలు సేయుదాన నే
నాయని సంభ్రమింపనగునాయని సైరణసేసితిన్ ధృతిన్. 221

ఉ. అవ్వనుదాతనుం గఱకులాడఁగ నేటికి? దాదులైనమి
మ్మెవ్విధిమించవాడ నగుహేయవిపత్తు దాతకశ్యపుల్
బ్రువ్వఁగదూఱఁగాఁదగదు పుట్టిననాఁడె దయావిహీనులై
దవ్వులఁద్రోచిచన్నతలిదండ్రుల దూఱదసారెసారెకున్. 222

ఉ. పిన్నటనాటనుండియును బెక్కుడుముల్ పడుచున్నదాన నా
బన్నముఁ జెప్పనేల? యిది ప్రాక్తనజన్మకృతంబు దీనికిన్
వన్నియవెట్టినట్లు జనవల్లభుఁ డక్కట! యెంతవేఁడినన్
గన్నడచేసి తత్ఫలముఁ గైకొనగంటిసి వేయునేటికిన్ 223

ఆ. ఆమనోహరాంగుఁ డనురాగభరితుఁడై, వేవిధముల నన్ను వేఁడుకొనియె
నెంతవేఁడుకొనిన నెక్కసక్కెములాడి, వినక చేలనైతి వెలఁదులార! 224

ఉ. నావెతఁ జెప్పనేల? నరనాథుని మేను శిరీషకోమలం
బీవలరాజుతూపులకు నీవిరితావికడింది కాఁకకున్
దావలమయ్యె నేరహినిదాళెనొ యయ్యయొ! యెంతవేఁడినన్
నేవిననేరనైతిని నీతికిలోనగుటన్ భ్రమంబుగన్. 225

తే. అధిపునేమమునా నేమమూకలించి, నేఁడుకవగూర్చియిరువురనిర్వహించి
కనికరముపూనుపరమోపకారులెవ్వ, రీతమకమెట్లునైతు నే నేమినేతు. 226

సీ. తరుణప్రసూనకేసరముర్మురంబు పాన్పునబిసాళించిపైఁ బొరలుదానఁ
బ్రోదిమైనిండారుపూఁదేనెకాల్వకును దుస్సాహసముచేసిదుముకుదానఁ
బరువంపుఁజిగురాకుబాఁకుఁ జేకొనిలేచి హుమ్మురంచునురమ్ము గ్రుమ్ముదాన
మెఱుఁగొన్నవలపుఁదెమ్మెరకాఱుబిచ్చుకో నాపన్నిదముదీఱనడచుదాన
గీ. నీమరునిబాణములరాక లీసుధాంశు
కళలబలుకాఁక లీమరుత్కందళంపు
జోక లీకోకిలంబులపోకలోర్చి
గోల! వేయేల నీకతాళఁజాల నమ్మ! 227

సీ. నా మ్రోలనిరతంబు నటనంబుగావించు నెమిలియెవ్వరి మ్రోల నిలుచునొక్కొ?
నా వెంటఁ బెనుదంటయై విహారమొనర్చు కలహంసియే లీలఁ గడచునొక్కొ?
నా హస్తమున వ్రాలి నలువొప్పఁగాఁ బల్కు చిల్కయెవ్వరిచేతఁ జేరునొక్కొ?
నా చేతి మేఁత చే నానాఁటఁ బెనుపొందు నీలేఁడికొనమ ప్రాపెవరిదొక్కొ?
గీ. యనుచు రాజర్షికన్యక పనవిపనవి, యలసిసొలసి ప్రియంవదయంకపాలి
వాలివ్రాలినదశదిశలల మెసఖుల, గములహాహారవమ్ముల కలకలమ్ము. 228

వ. ఇట్లు మూర్ఛిల్లినఁ బ్రియంవదాప్రముఖ సఖీవిసరమ్ము నలుగెలంకుల నక్కన్యకా
మణిం బొదివికొని. 229

మ. కనుదమ్మిన్ హిమవారిపూరము నుపంగాపించుఁ దానవ్యధ్ఘ్న
స్తనకోకమ్ములఁ జంద్రకాంతమణులుం జందాళలుం దంచు మై
ననకూనం బలుమారు వీజనములున్ రాదటంచున్ సఖీ
జనముల్ దేర్చిరి మెల్లమెల్లనఁ జెలిన్ శైత్యోపచారంబులన్. 230

వ. తదనంతరంబునం బ్రియంవద దరహాసభాసురముఖి యగుచు ననసూయతో మెల్లన
నిట్లనియె. 231

సీ. పుట్టినప్పుడె గాధిపట్టి గాదిలిపట్టిఁ జాలిపక్కిసమాట సూనృతంబు
మాలినీతటసీమఁ గోలఁ గాంచి పరించు నూర్ధ్వరేతుని వాక్యముత్తమంబు
ప్రోదికై మనలఁ బంపుచుఁ జేయు నదితికశ్యపులసంవాదంబు సమ్మతంబు
తరుణిచిన్నెలు చూచి దైవజ్ఞులగు ఘనుల్ నిర్ణయించినమాట నిక్కువంబు
గీ. నిఖిలరాజాధిరాజమాణిక్యమకుట, తటఘటితపాదపద్ముఁడై ధరణి నాల్గు
చెరఁగులేలెడు దుష్యంతుఁ జెట్టపట్టి, భూరిసౌఖ్యములందు నీపువ్వుఁబోణి. 232

వ. ఇట్లగుటం గాలయాపనంబునకు సమయంబు గాదు సెపచ్చునంతకు నిక్కన్యారత్నం
బు నతిప్రయత్నంబున సురక్షితంబు గావించున దియని యనసూయాందులకు నొప్పం
జెప్పి నరేంద్రస్కంధావారంబుఁ బ్రవేశించె నసినపని జనమేజయుండు తరువాతి
చరితంబు వినవలతు ననుటయును. 233

ఆశ్వాసాంతము.

క. శ్రీసురపూజాస్పదపద, భాసురవాసరకరోదవసితాలసిత
క్ష్మాసురరక్షాదక్షహృ, తాసురచంక్రమణ! వేంకటాచలరమణా! 234

మాలిని. విమలకమలనేత్రా! విక్రమాక్రాంత మిత్రా!
ప్రమదకరచరిత్రా! ప్రస్ఫురత్ప్రీతపత్రా!
కుమతితృణలవిత్రా! కోమలశ్యామగాత్రా!
యమితగుణపవిత్రా! యబ్ధికన్యాకళత్రా. 235

గద్య. ఇది శ్రీమత్కౌసల్యానందన ప్రసాదసమాసాదితకవితావిచిత్ర మైత్రేయసగోత్ర నృసింహాగురుపుత్త్ర కృష్ణకవిప్రణీతం బైనశకుంతలాపరిణయం బనుమహాప్రబంధంబునందు దుష్యంతుండు కణ్వాశ్రమంబుఁ బ్రవేశించుటయు శకుంతలాసంవాదంబు ప్రియంవదవలననమ్మహీకాంతుండు శకుంతలాజన్మప్రకారంబు వినుటయు సేనానివేశంబును జలక్రీడయుం జంద్రమన్మథాద్యుపాలంభంబును శకుంతలావిరహావేదనాభరంబు సైరింపంజాలక ప్రియంవద నరేంద్రస్కంధావారంబుఁ బ్రవేశించుటయు నను విశేషంబులు గలిగిన ద్వితీయాశ్వాసము.

---

శ్రీ ర స్తు.

# తృ తీ యా శ్వా స ము.



రమ్య వైజయంతీ
తోరణవిభ్రాజమానదోర్మధ్యగృహా
ధారశ్రీసంసేవ్యా !
గీరమణస్తవ్య ! శేషగిరివాస్తవ్యా ! 1

వ. దేవా! వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లు ప్రియంవదనరేంద్రస్కం ధావారంబుఁ దఱిసి తిరస్కరిణీప్రభావంబున నంతర్ధానగతయై మెల్లనరాజమంది రంబు సొత్తెంచి కలయుంగనుంగొనునవసరంబున. 2

శా. ఆరాజన్యుఁ డనన్యగోచరమనోజార్తిజ్వలన్మూర్తియై
యారాజర్షిసుతాధరాధరసుధాహారంబు పైఁగూరిమిన్
సారస్ఫారచతుర్విధాన్నషడ్రసమజ్జాపాయసాపూపవ
ల్లూరాద్యుత్తమభుక్తిమానసమునన్ లోభింపఁడింతేనియున్. 3

వ. ఇట్లు శకుంతలావిరహానలసంతప్యమానమానసుండై యమ్మానవేశ్వరుండు. 4

సీ. ఉదయదిందుప్రభాభ్యుదయసంపదలకుఁ దలసూపనోపక తలఁగి తలఁగి
కలకంఠకులకంఠకాకలీకలనంబు కర్ణగోచరమైనఁ గలఁగి కలఁగి
మరుఁడేయుఁ గేదంగివిరికతారపుప్రేటు మదికగ్గలంబైనఁ గలఁగి కలఁగి
చందనాచలమరుత్కందళంబులవారి దురవగాహంబైనఁ దొలఁగి తొలఁగి
తే. తేపమీఱఁగఁ దల్పంబు డిగ్గిడిగ్గి, తేపతేపకు నిట్టట్టుఁ దివిరితివిరి
పొలఁతి చెలువంబుమాటికిఁ బొగడిపొగడి, వసుధవ్రాయుచు మోమువాంచివాంచి. 5

ఉ. హా! యను మౌనిరాజతనయా! యను హా! యసిపల్కవే మిటా
రీ! యను రమ్ము సమ్మదకరీ! యనుఁ గన్నడసేయకో లతాం
గీ! యనుఁ దాళఁజాలఁ గటకట! యను ముద్దిడ సిమ్ము కీరవా
ణీ! యను బాలమేలు తరుణీ! యను రాజు విరాళిజాలిచేన్. 6

వ. ఇట్లు మునికన్యకాధ్యానపరాధీనుండై యున్మత్తప్రలాపంబులఁ బొరలుచున్న రవరుం జేరంజని. 7

సీ. తివుటఁ దియ్యవిల్తేనె దివురువాతెఱఁగంద నుసురుసురని వెచ్చనూర్చువానిఁ
జెక్కుటద్దములపైఁ జిందిజీరలువాఱ నిభృతుఁడై కన్నీరునించువాని
గోరంతసడిఁ గన్నగుండె జల్లనఁగ సొలసి దిక్కులు దేఱిచూచువాని
మేన బుప్పొడియొత్తఁగా నొయ్యనొయ్యన విరులపానుపుమీఁదఁ బొరలువాని
గీ. మదవతీ! మత్తకాశినీ! మంజుభాషిణీ! మనోహారిణీ! మానినీ! మరాళ
గామినీ! యెంత వేఁడినఁ గనికరమ్ము, బూనకేఁ చెదవని మూర్తిఁ బొరలువాని. 8

ఉ. కాంచి చతుస్సముద్రపరిఖాప్రతిభూతలయాధినాథుఁ డ
క్కాంచనగాత్రి కన్నఁ బనిపెమ్మున జింతిలుచున్నవాఁడు భా
వించఁగఁ దుంటవింటిదొరవీరలయుర్వుగిపొందుఁ గూర్పనూ
హించె బళీ! యటంచుఁ బృథివీశునకుం బొడసూపె నమ్రయై. 9

వ. ఇవ్విధంబున 10

క. జయజయశబ్దంబులలో, భయవినయములఁ మ్రోలనిలుచు పద్మదళాక్షిన్
బ్రియమునఁ గనుఁగొని యిట్లను, నయనయదయమానమానసాబ్జుండగుచున్. 11

మాలిని. సేమమె తామరసోదరసోదరచిత్రనిభాననశాలినికిన్ ?
సేమమె ఫాలచలాలకజాలకశీర్ణదవాగ్న్యుమహోర్మికికిన్ ?
సేమమె ఫుల్లసువర్ణసువర్ణవిభాత్వరదీధితిమాలినికిన్ ?
సేమమె భాసురభావజరాజపవాశిలదండితకేళినికిన్ ? 12

ఆ. అనుచుఁ బెక్కుమారులత్యాదరంబున, గన్నె సేమమరయుచున్నఁ గాంచి
సన్నవాఁడనగుచు సకియప్రియంవద, పార్థివేంద్రుఁ జూచి పలికె నిట్లు. 13

ఆ. తడవులేదుచూచి ధరణీశ ! యింతలో, సేమమరయు టెల్ల చిత్రమయ్యె
నతనుమంత్రసిద్ధు లగుమహాపురుషుల, కెగ్గుసేయు సేమ మెట్లుగలుగు ? 14

ఉ. భావజరూప! నిన్నలరుబంతినఁ గల్చినయంతనుండియుఁన్
దాపలమైనభూరిపరితాపమునన్ మునికన్య ఖిన్నయై
పూవులదండలున్ వలచుపూఁతలుసొమ్ములు భక్ష్యభోజ్యముల్
కావలెనంచుఁ గైకొనక గాసిలుచున్నది సూనశయ్యపై. 15

ఉ. ఆదిని బుష్పబాణగసమంతరుదంతము గ్రాఁచెనగ్గమై
యూదటనవ్వసంతకుసుమాకరముం బ్రతికూలమయ్యె జం
ద్రోదయమంతకుంగిరఁ జుచున్నది రాజ్యము గాంక సేవచేఁ
బైదలి మేనుసౌఖ్యమునఁ బాటిలునో యనివిమ్ము వేఁడెదన్. 16

క. ముదుసళులవ్వగాఁ దాతయు, హాదయునననుండు తీర్థయాత్రకు వెడలెన్

సీ. ముఖపూర్ణశశియోగమునఁ దమించురవిలీలఁ దగురత్నమకుటమూదలఁ దలిర్ప
హస్తాబ్జముల ప్రాలునఖులు నాసీలంపుటుంగరంబులు ప్రేళ్ల నొఱపు నెఱప
గాత్రకాంచనయష్టిఘనదీప్తిరింఛోళి చెలువునఁ బచ్చని చేలజీరఁ
జివురుల గెలువఁ దాల్చిన కెంపుజోడుల కరణినంఘ్రుల మోదికలు రహింపఁ
తే. గంతకలితసరస్వతిఁ గౌఁగిలించు, సమరసవిభాతినురమున వారమడర
నంగభవమంగళాకృతి నాశ్రమంబు, కీవి మైఁ జేరె దుష్యంతభూమిభుండు. 27

వ. ఇవ్విధంబున నాశ్రమంబుఁ బ్రవేశించి చనునవసరంబున. 28

సీ. పోఁ గూడదీ దారి పుల్లహల్లకసార కాసారసీకరకర్దమంబు
చనఁ గూడదీ దారి సన్నాగళస్నాగ పున్నాగభిన్నాగసన్నుతంబు
చొరఁ గూడదీ దారి వరసంకుమదపంక పంకిలైణాంకోపలాంకితంబు
గమి గూడదీ దారి సుమగుంజదళిపుంజ పంజరీకృతమంజువంజులంబు
తే. నాథ! యిది శష్పరంపుటనంటికోన, మహిప! యిదిగో తపస్వికాయమానసరణి
నృపకులాగ్రణి! యిది మాలినీప్రవాహ, మధిప! యదె చూడుము శకుంతలావసథము.

వ. ఇవ్విధంబున సూచింపం బ్రియంవదావదనారవిందకందళదమందమకరందబిందు
సందోహంబులం దుందిలహృదయహిందోళుండై యారాజపురందరుండు మూహు
ర్ముహురుల్లలన్మాలినీకల్లోలఘుమఘుమారావంబు మార్దంగికవిమర్దనపరిణర్దన్మర్దళని
నదంబుగా, మధురమధురసప్రలుబ్ధముగ్ధమధుకరనికరఝుంకారంబు శ్రుతిప్రకారంబు
గాఁ గోకిలకలస్వనవితానంబు గానంబుగాఁ, జిత్రంబగు వాదిత్రంబునకుం బాత్రంబు
లయి మాద్యన్మయూరకళత్రంబులు నర్తనంబులం బ్రవర్తింప, నిలింపకుటవిటం
పాంతరనిర్యత్సుధాసుధాకరకలాపంబు కరదీపికారూపంబయి నలుగెలంకులగండలు
కొను సాంధ్యతిమిరంబుల నెడగలుగం జడియుచు మలయానిలవలనవిలులితలవ
లీలవంగలుంగాదివివిధకుసుమకేసరపరాగపటలంబు మంగళాచారసముత్సారితపిష్టాత
కంబుగాఁ, గూఁజచ్ఛుకనికరకాకలీకలకలంబు పుణ్యాహఘోషంబుగా, మహోత్స
వంబున శకుంతలాభవనంబుఁ బ్రవేశించునవసరంబునం బ్రియంవదాప్రేరితలై
తత్పరిచారికాజనంబులు నీరాజనంబాచరించి, సప్రణయంబుగా నభ్యంతరంబునకుఁ
దోడ్తెర నుచితపీఠంబునఁ గూర్చున్నయన్నరనాథు నర్ఘ్యపాద్యాదివిధులం బూజిం
చి, సఖీజనమధ్యంబున లజ్జావినమ్రమౌళి యై యున్నయక్కన్యామణిం జూచి
దుష్యంతమహీకాంతుసితోఁ బ్రియంవద యిట్లనియె. 30

సీ. పనులసందడి నైనఁ బరులవీనులు సోఁకఁ జేరలుంగిడ లేనిభీరుమధ్య
ప్రహసనంబున నైన బాహిరంబగునట్లు పకపకనవ్వనిపద్మగంధి
యూసాయమభ్యాగతార్చనంబున నైన నలసిలివననిపువ్వారుఁ బోణి
సతతంబు తన ప్రాణసఖులతో నైనను భావంబు బయలు కొల్పనిలతాంగి

మదనమాంద్యమున నెమ్మది బోధరాదయ్యెఁ గావుము సంజీవకరణికరణి
నతనుతాపభరంబు మితిమీఱి సొగియించె మనుపుము శర్కరాంభములపగిది

తే. నతులతావకరూపరేఖానురాగ, రసఘురవిహారకలితజాగ్రన్మనోజ
భూతవేదన నెంతయుఁ బీతివొడమె, యువతి! నీసూక్తిమంత్రమ్ము లాలయనిమ్ము. 38

సీ. మొనగుబ్బలెదఁ జేర్చి మోవితేనియ లిచ్చి ముచ్చటల్ దీర్పవే ముద్దుగుమ్మ!
కొసరు వైపులనవ్వి కొనగోట దువ్వినా తమి నిస్తరింపవే తలిరుఁబోణి!
పొందిపాయఁగఁ బాసిపోలయల్కఁ జేసినా బోధనల్ వినఁగదే పువ్వుఁబోణి!
మగచందమునఁ గల్కిమాయముల్ పన్నినా మది కింపుఁ గూర్పవే మచ్చెకంటి!

తే. పరిపరివిధంబు రతులకేర్పడిన మేటి, యంగముల కెల్లనునికిపట్టైన బోటి
విరులసింగాణి సురధాణి విజయధాటి, మేదినీస్థిఁ గలుగునే నీదుసాటి. 39

వ. అని యనేకప్రకారంబులం బ్రార్థింప సాచిస్మితలసితంబుగా మొగంబువాంచి యొక్కించుక భావించి యక్కాంచనగాత్రి గోత్రాకళత్రునితో నిట్లనియె. 40

ఉ. అక్కట! తాతకశ్యపులయాదరణంబున నున్నదాన న
న్నెక్కటి నిట్లు నేఁ గనుటయే వివరంబిది యేటికిం గ్లి మీ
యక్కఱదీఱినం బిదప నాఱడిఁ జ్రొచ్చెద రేలయేల నే
నెక్కడిదాన నయ్యెద మహీవర నే వరమర్థి వేఁడెదన్. 41

ఉ. వైశము కణ్వులింతకును వత్తురు వారలయానతిం గడుం
దాలిమిఁ బెండ్లియాడుము యథావిధి నంతకు నీకు నెమ్మదిన్
దాళిక లేకయుండిన హితమ్మగు నేనియుం నగ్రభార్యగా
నేలుము నన్ను మత్సుతుని కిమ్ము మహీవలయమ్ము సమ్మతిన్. 42

సీ. అదితిమాయవ్వ కశ్యపుఁడుమాతాతసూ తొలుతవారల కెట్టు దోఁచునొక్కొ?
తాతకశ్యపులచిత్తము కంచుపదనుసూ దుర్వృత్తయని ప్రేమదొఱఁగునొక్కొ?
నాప్రాణసఖులచందము నమ్మరాదుసూ సుబ్బుసుబ్బుల దూఱఁ జూతురొక్కొ?
యంపిపొందినవారలాచారపరులుసూ బాగుగాదని బాహ్యపఱుతురొక్కొ?

ఆ. యహహ! రాజరాజయాజవంజవసుఖా, సక్తియుం క్తినోలి సాహసమున
నీమనోరథంబు నెఱవేర్తు నేనియుం, నవుల నెట్లునైఁతు రార్యజనులు. 43

వ. అని యిట్లు బహుప్రకారంబులం బరిహరించు నమ్మించుఁబోణి నుపలాలించుచు నిట్లనియె. 44

శా. కానిమ్మేనిను నెమ్మి నగ్రమహిషింగా సంతరింతున్ భవ
త్సూనుం బట్టముగట్టుదున్ మనవుసాక్షుల్ వాసరంబుల్ నిశల్
భానుండున్ శశి పంచభూతములు దిగ్భాగంబులున్ గాలమున్
శ్రీనారాయణదేవుఁడుం గలఁడు శిక్షింపంగ రక్షింపఁగన్. 45

వ. అని యమ్ముద్దియ నెట్టకేలకు నొడంబఱిచి సురుచిరాకల్పం బగుకిసలయతల్పంబునకుం దిగిచి. 46

శా. కాంచున్ గామిని కామనీయము బలాత్కారంబునం గేలఁగీ
లించున్ వేనలి చెక్కునొక్కు కడుబట్టుం గుబ్బపాలిండ్లనం
కించుం గాఁగిటఁ శయ్యకుం దిగిచి సొక్కించుం గళావైఖరిన్
గించిన్మధ్యఁ గరంచి యాసరణి భోగించెన్ విభుం డయ్యెడన్. 47

సీ. కొమ్మ! నీ నెఱికురుల్ కొదమతుమ్మెదలంచు సోయగం బరుదారఁ జూచునొకటఁ
గలికి! నీ కెమ్మోవి కండచక్కెర యటంచు గొడఁగి పానక మానఁ గోరునొకట
సొలఁతి! నీ చెక్కులు నిలువుటద్దములంచుఁ దన మోము రహిఁ గాంచఁదలఁచునొకట
భామ! నీ పాలిండ్లు పసిడిమ్మపండ్లంచు నీటు గాఁ గొనఁ గోటమీటునొకటఁ
తే. గులుకులమిటారి! చిలుకలకొలికి వనుచుఁ, జెలఁగ తమిదీఱఁ గాఁగిటఁ జేర్చునొకట
బాల! నీ లీలఁ గరఁగించి పార్థివుండు, హాళి నిష్టోపభోగంబు లందుచుండె. 48

వ. మఱియును. 49

సీ. కొసరి వాతెర నొక్క కసుఁ గంటెనోయంచు సిరతుఁడై మెఱుంగేల నివిగినివిరి
గోటగుబ్బలు మీటినాఁటెనోయనుచుఁ దా సార్గచేఁ గుంకుమం బలఁదియలఁది
వెలయఁ బాన్పునఁ దార్చివిరులొత్తెనోయంచు వగపుచే నురముపైఁ దిగిచితిగిచి
తమిదీఱ భోగించి శ్రమమయ్యెనోయంచు వెఱపుచే వీవనల్ విసరివిసరి
తే. సోయగముఁ గాంచి తిలకించి సొబగుమించి, మరులు గెరలించి కెరలించి మదిఁ గరంచి
యఱమరలు దీఱ లాలించి యామతించి, కలికితొలికూటమి విభుండు తులకరించె. 50

సీ. తరసాఘన స్తన స్తబకాదయాశ్లేష చలిత బాలావక్త్ర జలరుహంబు
పతికరవ్యతికర భ్రశ్యత్సునారూఢ వనితానవాంశుకుంతనపటంబు
రమణసంక్రమణసంభ్రమవివర్తిత యోషి దఖిలాంగసంగిభూషారవంబు
పురుషాధిగమసుఖస్ఫురితాశ్రులవలస న్ముగ్ధాముహుర్నేత్ర ముకుళనంబు
తే. రభసవిలులితశయ్యోత్తరచ్ఛదంబు, పులకచులుకితదర్పణోత్ఫుల్లగల్ల
ముల్లలత్కేశపాశమన్యోన్యరాగ, నిరతిశయ మయ్యె నవయౌవనిధువనంబు. 51

శా. ఆలోలాలక మాచలత్కుచభరం బాస్విన్నగల్లద్వయం
బాలీఢప్రియపాణిపల్లవనితంబాశ్లేష మామీలదు
న్మీలల్లోచన మాత్రపాభరదరస్మేరాననాంభోరుహం
బాలంబాభరణంబు గానుపరతం బాలేమ సల్పెన్ ధృతిన్. 52

వ. ఇవ్విధంబున నాదంపతు లతులసంపదలం బొదలుచు నిద్రాపారవశ్యంబునం దనరు నవసరంబున. 53

ఉ. తోయజవైరి మాసె రవిదూర్పుదెస న్నొన చేసెఁ జుక్కలుం
జాయలుదీసెఁ గైరవిణిసైకమునంగను మూసెఁ బద్మినీ
నాయిక కుందువాసె రతినాథుఁడు వాలొరఁజేసెఁ గొక్కరో
కోయని కోడి కూసె నలకోకిని గోకముఁడాసె నత్తఱిన్. 54

ఉ. పూవులతావులం దనరి పొందిక కందిక లియ్యు శయ్యలం
దీపలనావలం బెనఁగి యింపు రహింప సతుల్ పతుల్ ధృతిన్
భావజకేళిఁ దేలునెడఁ బమ్మినచెమ్మటలారఁ దోరమై
వీవఁదొడంగె నంగముల వేఁకువ తేఁకువఁ గమ్మతెమ్మెరల్. 55

ఉ. సారలసత్సహస్రకరశాఖలతో నినుఁడుగ్రమూర్తియై
ఘోరతమమ్ములం దొలఁగఁ గోఁన మున్నడియై యనూరుఁడున్
ధీరతమీఱ నయ్యరుల తేకువమాన్పఁ దలంచినన్ మహా
శూరులఁ జేరుభీరులును జాపుదు రుద్ధతి యుద్ధతిప్రతై. 56

వ. ఆసమయంబున. 57

ఉ. గాములమేటి లోకములకన్ను తమమ్ములమొత్తి యామినీ
భామతొలంగుబావ సెకవాఁకలగుండము చక్రవాకపు
న్నోములమెట్టపంట పదినూఱులచేతులజోదు పచ్చబా
బామొనచూపు తేగదొరభానుఁడు తూర్పునఁదోఁచె నత్తఱిన్. 58

క. ఆలోన తా మేల్కని, బాలారత్నంబు కూర్మిపతికౌఁగిటిలో
నాలీఢయగుటఁ గదలక, మెలమ్మున నుండ విభుఁడు మేల్కనుననుచున్. 59

వ. తదనంతరంబ మేల్కాంచి సపతింగాంచి సప్రణయంబుగాఁ దచ్చరణంబుల కెరఁగి తదనుజ్ఞాత యై. 60

శా. వీడం బాఱిన నీవితోఁ గిటినట ద్వేణిలలామంబుతో
వాడుం దేఱినపువ్వుమాలికలతో వ్యత్యస్తహారాళితో
వ్రీడానమ్రముఖంబుతో శ్రమజలావిద్ధాంగరాగంబుతోఁ
గ్రీడాతల్పము డిగ్గె బాల సురతక్షీణావనమ్రాంగియై. 61

వ. ఆసమయంబున. 62

శా. తానుం బానుపు డిగ్గి యగ్గలిక నద్ధాత్రీకళత్రుండు స
స్థానానూనకటాక్షవీక్షణములన్ మన్నించుచున్ బ్రీతుఁడై
చానం గౌఁగిటిలోనికిం దిగిచి విశ్వాసంబుతో నిట్లనెన్
ఓ మానం బేటికి ముద్దుగుమ్మ! సెలవిమ్మా సమ్మతిన్ వీటికిన్. 63

తే. అనుచు గవనోమ్ముఖుండైనయ ధపుమోము, రాచపిల్లకన్నె తప్పక చూచిచూచి
ప్రాణనాయక! నిన్నెడఁబాయఁజాలఁ, దోడకొనిపొమ్ము నన్ను నీతోడ నెమ్మి. 64

మ. అనుచుం గుత్తుకదొట్టులేఁబలుకుతో నాకుంచితాంగంబుతోఁ
గనుదోయిన్నెలకొన్నబాష్పములతో గాటంపునిట్టూర్పుతో
జనితస్వేదకపోలపాలికలతో జవ్వాడుమధ్యంబుతో
వనితారత్నము వెన్నడిన్నడువ తేవన్ భూవిభుం డిట్లనున్. 65

క. కొమ్మా! యిచ్చోటనె నెల, కొమ్మా నెచ్చెలులఁ గలసికొమ్మా నెఱిచే
కొమ్మా కులపతియనుమతిఁ, గొమ్మా నానేమమరసికొమ్మా పిదపన్. 66

ఆ. ఆజ్ఞ మీఱినడచి యయ్యయో! దిసికి, వన్నెవెట్టినట్లు వంచనమున
వన్నెదేని గాంధర్వమ్మున నినుఁజూడఁ, గానకలుగు మానిమానసమున. 67

క. కోపించుం గ్రక్కున నా, తాపించుక్ గాన మానుచిత్తముతూర్తిక్
రూపించినగరిమాదటఁ, బ్రాపంపుము హితులఁ బనుతుఁ బద్మపలాక్షీ! 68

వ. అని బహుప్రకారంబుల నొడంబఱిచి గాఢాలింగనంబాచరించి యిక్కాంతాలలామంబు సప్రేమంబుగా వీడుకోలుపం బ్రీతుండై యుశ్రమంబున నయ్యాశ్రమంబు వెలువడి బలఁపడిం బయనంబు సాటించి చతురచతురంగసేనాపరివృతుండై హస్తిపురంబుఁ బ్రవేశించి యథాపూర్వకంబుగా రాజ్యంబుఁ బాలించుచుండె నంత నిక్కడ శకుంతలావధూటియుం సవ్రీడంబుగా సఖులకుం బొడసూపి యథోచితవర్తనంబునం బ్రవర్తిల్లుచు నాత్మగతంబున. 69

సీ. వచ్చెఁబో కణ్వసేవాకుతూహలమునఁ బొదలచాటునరాజు పొంచనేల?
పొంచెఁబో చిలుకనుబూనిబంతినటువేయఁ దప్పియప్పభుఁడొమ్ముఁ దపుల నేల?
తపిలెఁబో యెనిమిత్తముచసియొదయించు భూపజాష్టంబుగాఁ బలుకనేల?
పలికెఁబో తల్లిదండ్రులయాజ్ఞఁగొనకనే జగతీశ్వరుసికూర్మి నలుపనేల?
తే. చలిపితిసిబో నృపాలుండుసంయమీంద్రు, నాజ్ఞఁగొనినన్నుఁదోడ్కొనకరుగనేల?
తలఁచినతలంపు పైఁపంబుఁ దలఁచెనకట! యెట్టుగానున్నదో కొమీఁదసీశ్వరాజ్ఞ? 70

క. ఆమునికులసోమునితో, నేమని వివరింతు మఱియు నిదివివరింపన్
గామిని పరగామినికో యి, గామి నిజంబనుచుఁ గనలి గర్హించునొకో? 71

వ. అని యిత్తెఱంగున విచారడోలాయత్తం బగుచిత్తంబుతో నమ్మత్తకాశిని తత్తఱంబునం దలయెత్తి తన యగ్రభాగంబున. 72

సీ. పరమార్థతత్త్వానుభవముపక్కణించు సమధికబ్రహ్మవర్చసమువాని
కైవల్యవాంఛానుకీలనంబుపిపఁంచు వ్యాఘ్రాజినోత్తరీయంబువాని
తెలిచూడ్కిలోలత్స్యమలఁతబాహిరముగా మునుకొన్నశాంభవిముద్రవాని
వేదమల్ మూర్తీభవించు మేదలపించు సముచితధ్యయనఘోషంబువాని
తే. మాఱుపాత శనఁజాఁడైయున్నవాని, వాఁచఁటుభక్తిపుంభావమ్మనవని
నాశ్రమక్షమతింబునాగిరగి తెంచ, తఱిగిత్సుపుఁ బొడగాంచెఁ దరుఁబోణి.

వ. ఇవ్విధంబునం బొడగాంచి భయలజ్జాసంభ్రమంబులం దొట్రుపడుచు నభ్యుత్థానం బాచ
రించి. 74

సీ. ప్రమదాశ్రుజలము చేఁ దెమలు కాటుకజీర కులుకుఁ జెక్కుల జాఱుకురులు గ్రమ్మ
మవ్వంపు మొలకచెమ్మటల నెన్నుదుటిపై బొరలు పాపటమణి తొసరులు దాఁక
మురిపంబు గులుకు పల్కుల వాతెరను జిందు కెంపుముక్కఱచాయ కిరుసుఱుపఁ
గళికైన నెలకూనగములఁ జేరురముపై రమణీయచంద్రహారములు మసుఁగ
తే. నిదుర వేగింపుఁగ సెక్కెంపు సదములంపు, మొలకసిగ్గున నగపడు మొగపుదిగువ
నొడలిబడలిక గరుపంపు నడలు దాఁపఁ, దంష్ట్రకెదురేగి మ్రొక్కె నత్తలిరుఁబోణి. 75

క. మ్రొక్కిన గాదిలిపట్టిన్, మక్కువ దళుకొత్తఁ జూచి మానిమనమున్
జొక్కము సుదివ్యదృష్టిం, గ్రక్కున భావించి తెలిసె గత మున్నుఁడై. 76

వ. ఇవ్విధంబునం దనదివ్యజ్ఞానంబునం గూఁతుం దుష్యంతుండు గాంధర్వవివాహంబునం
బరిగ్రహించుటయుఁ, గన్యామణికిఁ దత్కాలంబున గర్భప్రాప్తియుం గాఁగలసంపల్లా
భంబునుం దెలిసి కృతకృత్యుండై కరుణార్ద్రకటాక్షవీక్షణంబులం దత్క్షణంబ యయ్య
భయ నభయానకరసంబు వాపి మధురాలాపంబుల నుపలాలించుచు నిట్లనియె. 77

శా. ఆల్లుం డయ్యె మహామహుం డయిన దుష్యంతుండు ధాత్రీతలం
బెల్లం దాలుచు చక్రవర్తిసుతుఁ డై యిప్పాటనీకుక్షిరా
జిల్లన్నేల్లోరసానివై తివి బళీ! చిన్నారిపొన్నారి నా
తల్లీ! ధన్యతఁ గంటి నీవలన నా దౌహిత్రలాభంబునన్. 78

వ. అనుచు నాశీర్వచనపూర్వకంబుగా నక్కన్యామణిం దేర్చి సంబోధనం బాచరించి
ప్రియంవదాదిసఖీలలామంబులం బిలిచి యివ్వరారోహ దోహదవతి యగుట నెద్దే
నియుం వాంఛింపం దొరకొని మౌగ్ధ్యంబున వాక్రువ్వంజాలకుండుం గావున మనోరథం బరసి
సమకూర్చునది యని యాదేశించి యథానుగుణంబుగా వర్తింపం గూఁతు నాజ్ఞాపించి
తాను యథోచితవర్తనంబునం దనరుచుండె నయ్యవసరంబున. 79

తే. పౌరవాన్వయమునకాదికారణంబు, కణ్వదౌహిత్రలాభైకకల్పభూజ
మాళిజనదర్శనోత్సవ మలశకుంత, లాయువతి దాల్చె దోహదలక్షణంబు. 80

సీ. కలలపోషణసుధాకలశముద్రలరీతి నలినాక్షిచనుమొనల్ నలుపులయ్యె
మనుపనాదొరగాంచు మధ్యలోకము భాతి వెలఁదుకమధ్యంబు విస్తరించె
గర్భార్భకుని యూర్పు గాడ్పుతో డ్పడినట్లు శ్రీమతీమణి యూర్పు లినుమడించె
నత్యజదయనిర్వేదహితావళులమాడ్కిఁ లలితాంగివళులు పేలవములయ్యె
తే. జఠరపిఠరాంతరాళకాసారసార, సాపదాసలహంసప్రచారచారు
తరతసుభ వానభావంబుతనరు లీల, నరయనరయంగఁ జెలియానమలసమయ్యె. 81

తే. పంచభూతగుణంబులనట్టుఁగొమ్మ, భూమిసవర్గముల కెల్లఁ బుట్టినిల్లు

అనిరసారసమాత్మఁ జూడరయఁదలఁచి, మిన్ను వాచవిగాంచె నమ్మధురవాణి. 82

సీ. శరభశార్దూలాదిసత్త్వంబులను బట్టి ధీరతోరణి విరోధింపఁ గోరు
శైలంబు శైలంబులీలతో నిరుగేల నిడి తాళగతుల వాయింపఁ గోరు
నుద్భటప్రతిభటవ్యూహంబు పైఁ గిట్టి యస్త్రశస్త్రముల నాటాడఁ గోరు
నిర్ధారుణీచక్రమేకచక్రంబుగా నింపుఁ బ్రాపారఁ బాలింపఁ గోరు
తే. వాజపేయాధ్వరశతంబు వరుసఁ జేసి, యాప్సితార్థంబు ద్విజకోటి కీడఁగఁ గోరు
నార్యవార్యమనస్స్థైర్యధైర్యశౌర్య, దుర్భరార్భకనిర్భరగర్భయుక్తి. 83

వ. ఇట్లు సంవత్సరత్రితయంబు కడచనునవసరంబున. 84

క. ప్రాంచత్తుంగస్థగ్రహ, పంచకమై యుల్లసిల్లుపటులగ్నమునన్
గాంచనగాత్రి తనూభవుఁ, గాంచెన్ భరతున్ భుజోపగతలాభరతున్. 85

మ. వసుధాచక్రమవక్రమై విలసిలెన్ వార్ధుల్ చెలంగెన్ నదీ
విసరం బచ్ఛపయఃప్రవాహములఁ బర్వెన్ దారకానాథుఁ డు
ల్లసితుండై తనరారె దేవగణికాలాస్యంబు మీఱెన్ దెసల్
వెస రాణించె శకుంతలాతనయునావిర్భావకాలంబునన్. 86

వ. తదనంతరంబ యక్కుమారుండు తాతవలనం జాతకర్మాదిసంస్కారసంస్కృతుండై
పెరుగుచు. 87

సీ. ఆకాశకూలంకషాకాశవనవాటి నుదయించుబాహులేయునివిధమున
క్షీరపారావారభూరివీచిమతల్లిఁ గనుపట్టునవసుధాకరునికరణి
వాసవాశావధూవరగర్వవరణంబు గడచి రాణించుభాస్కరునికరణి
నిగమాగమాచారసిగ్మితాధ్వరవేదిఁ దులకించువీతిహోత్రునివిధమున
గీ. గుహ వెడలి మీఱుసింగంపుఁ గొదమపగిది, గనిఁ బొడమి పేర్చు బలమానికంబుమాడ్కి
వర్ణితాతిగఫలకవికీర్ణచూర్ణ, కుంతలుండై తనర్చె శాకుంతలుండు. 88

సీ. సరసార్భటీమేటిశరభసాళువకోటి పరభయంకరధాటిఁ బరిభవించుఁ
గుంచితోరుకపోణినొంచిదక్షిణపాణిఁ బంచాననశ్రేణిఁ గొంచెపఱుచు
వారణంబులఁ గిట్టి పోరి తొండముఁ బట్టి భూరుహమ్ములఁ గట్టి కేరుచుండుఁ
జండవైఖరిమీఱి కొండలోయలఁ దూఱి గండకమ్ములఁ జేరి బెండుపఱుచు
గీ. రురుతరక్షుసృగాలశార్దూలకోల, ముఖముఖరదుష్టసత్త్వసమూహమూహ
మోహరింపఁగఁ దెగ వ్రాలి సాహసమున, డిందుపఱుచు శకుంతలానందనుండు. 89

వ. ఇవ్విధంబున నిసర్గబలానర్గళభుజార్గళుండై దుర్గంబులగు కాంతారమార్గంబులం గ్రుమ్మ
రు మహాసత్త్వంబులగు దుష్టసత్త్వంబులం బట్టి యక్రమంబున నాశ్రమతరువులం గట్టిపట్టు.
పఱుచు శకుంతలపట్టిం జూచి వాచంయము లాశ్చర్యచర్యుండగు నీశౌర్యధుర్యుండు

సర్వదమనుండను నామంబునం బ్రఖ్యాతుండయ్యెడుమని దీవించినం గాంచి కణ్వమహా
ముని ప్రహృష్టాంతరంగుఁడయ్యె నిట్లు యౌవరాజ్యపట్టాభిషేకార్హుండగు కుమారుం
జూచి తనయోగక్షేమం బారయ నెడఁ బ్రమత్తుండై యున్న నృపసత్తము వృత్తంబు
నకు విచారడోలాయత్తంబగు చిత్తంబుతో నత్తమిల్లి వేగుతటి మేల్కాంచి ప్రియం
వదతో శకుంతల యిట్లనియె. 90

సీ. విరులపానుపుమీఁదఁ బొరలుచుండెడు వేళ వరదుఁడై నాథుండు వచ్చినట్లు
నాథుఁడు రాఁ జూచి నగుచు దిగ్గన లేచి యెదురేగి పదముల కెరఁగినట్లు
పాదపద్మములపైఁ బడిన మెల్లన నెత్తి గ్రుచ్చి కౌఁగిటఁ జేర్చుకొనినయట్లు
గ్రుచ్చి కౌఁగిటఁ జేర్చికొని సంభ్రమించుచు హాయలు గాఁ బాన్పుపైనునిచినట్లు
తే. హాయలు గాఁ బాన్పుమీఁద నన్నునిచి మనిచి, మరులు గెరలించి లాలించి మదిఁ గరంచి
యతులగతులనురతులననలేనట్లు, మేలుకలగంటి నంతట మేలుకొంటి. 91

శా. లేమా! లేమరలేమరల్పకవిరాలిందూలిసోమాన్వయో
ద్దామున్ గోమున నాముకొంటినేఁటవే తానైహితాలాపముల్
ప్రేమం గోమలకోమలాక్షరముగాఁ బెక్కాడి సొక్కింప న
క్కామిం గామిని కామినీమనసిజున్ గైకొంటి నా కౌఁగిటన్. 92

ఆ. ఊరులు మరులుకొల్పి యూరించి యూరించి, కానిపోని బూటకములఁ దెమలి
కలసిమెలసి తాను గానివానివితాన, రాజరాజు మరల రాఁడు నేఁడు. 93

మ. తలిదండ్రుల్ దొలుపల్కఁ గూఁతునకు నుద్వాహంబు గావింపఁగాఁ
దలఁపుల్ పుట్టిన వీర్యశౌర్యగుణవిద్యాసంపదాచారపు
ష్కలమూర్తిన్ వరుఁ గూర్తురత్తెఱఁగుకున్ గాదయ్యె నాదైన పెం
డిలి యెవ్వారల నొవ్వ నాడుదు వధూటీ! నిక్కమూహింపుమా. 94

క. పంపుదు హితులన్నిను రా, నింపుమునని నమ్మఁబలికి విభుఁడత్తెఱఁగూ
హింపక పోరి నన్నుంగా, రింపం దొరఁగొనియె శమనరీతిననీతిన్. 95

వ. అని యివ్విధంబునం గజ్జలఝరులఝరులంబు లగు బాష్పజలంబులు కుచలికుచంబులం జాఱం
జారుముఖి ముఖంబు వాంచి విన్ననై వెచ్చనూర్చుచున్నం జూచి ప్రియంవద నయం
బొంద ననూనయించి కొండొకయవసరంబునం గాశ్యపుల కక్కోమలిమనోభావంబు
విన్నవించుటయును. 96

తే. కాంతునానన మెప్పుడు గాంతుననుచుఁ, గోరికలగూరు గాదిలికూఁతుఁ జూచి
యౌవరాజ్యపట్టాభిషేకార్హుఁడైన, భరతు నిరతిశయోత్సాహభరితుఁ జూచి. 97

వ. తదనంతరంబ యమ్మహాత్ముండు దన దేవియగు గౌతమిం జేరంబిలిచి గారవంబున శకుంత
లావధూటిం బిలువం బనిచి సన్నిధిం గూర్చున్న తనయ నుద్దేశించి తనపత్నితో నిట్లనియె.

క. పెనిచితిమి పెద్దఁజేసితి, మనుకూలుఁడు భర్తగలిగె నాత్మజుఁ డోదవెళ్
దనయామణి నత్తింటికిఁ, బనుపకయిట్లునుచు నేమిభాగ్యము సాధ్వీ! 99

క. తనుపంపఁగ షడ్రసముల, మనుపఁదగు భూషణముల మనుమని గూఁతుం
బనుపందగు నత్తింటికి, ననుపందగుఁ దగుసహాయ మాత్మజతోడన్. 100

వ. అనుచుం దన దేవి నోడంబఱిచి తత్తదనుకూలంబులగు వస్తుజాలంబులం దత్క్షణంబ సంఘటించి యాశ్రమనివాసులగు భూసురులకు సంతర్పణంబు గావించి మనుమసుం గూఁతు నలంకరించుటకుం బ్రియంవదాదులం బనిచిన వార లక్కురవాణిం జీనాంబరాభరణమాల్యాంగరాగంబులం గైసేసి భరతుం గాంచనాభరణవిస్ఫురితుం గావించి గౌతమియుం దారు నచ్చేడియం గణ్వులసన్నిధికిం దోడితెచ్చిన నచ్చెలువ జననిపను పునం దనచరణంబులకుం బ్రణమిల్లి సన్నిధిని సవ్రీడంబుగా నిలిచియున్నం జూచి తద్వియోగవ్యథావిధుర హృదయుండై యమ్మునివరుం డిట్లనియె. 101

చ. కనుఁగవబాష్పపూరములు గ్రమ్మెడుఁ గద్గదఖిన్నమై యెలుం
గనువున రాదుసూ హృదయమాకులమయ్యెడు మేను గ్రాన్పడుం
బెనిచినవానికింతవగఁ బిమ్మటిగ్రమ్మెను కన్నవారలుం
దనయను బంపలేక పరితాపభరంబున నెట్లు సైఁతురో. 102

తే. అనుచు వెతనొందుజనకుని యాననంబుఁ, జూచి యుడలున భాష్పించె సుందరాంగి
బాఁతిమైఁ దాఁజపెట్టినపావకంబు, పవనంజనఁ బైపయి విసరినట్లు. 103

సీ. బసిపుష్పములబారి తొలఁగించి మనుచునీ కోకిలాగ్భము తేఱుకొనినతీరు
పిన్ననాటనుగోలెఁ బెనుపఁ జూలైనయీ హరిణిబాలింతరాలైనమేలు
నోనాటములుదీసిమాపుమంచిడినయీ నెమలినోగంటిమానినవిధంబు
చేనాఁటు శాలూరమూనఁ బెంపైనయీ చెంగల్వకొలనుపూచినతెఱంగు
తే. అయ్య! మనశార్ఙ్గరవునిచేనైన చిత్ర, భానుచేనైన శృంగిచేనైనఁ గ్రోధి
చేనయినఁ జెప్పిపుచుపుము చెప్పిపుచుపు, వేని వేయేల నీకు నాయానసుమ్ము. 104

సీ. తోయంబుగామీకుఁ దోయమెత్తక కాని తోయంబుఁ ద్రావదీతోయజాక్షి
చివురెత్తువేడ్కమైఁ జివురుగైసేయమీ చివురందఁగోరదీచివురుఁబోణి
కుసుమాపచితిన న్యకుసుమంబ కాని మీ కుసుమంబుఁ గోయదీ కుసుమగాత్రి
ఫలదానములకైన ఫలియించియున్న మీ ఫలమంటదీమహోత్పలసుగంధి
తే. యట్టిమిముఁ బ్రోదిలాలించియరయుచున్న, ఘనశకుంతలదనకు మారుతోడ
నత్తవారింటికేగును నాదరమున, నాజ్ఞయీఁదగు వనభూరుహంబులార! 105

వ. అనుచు వనతరునికరంబుఁ గనుంగొని శకుంతలతో నమ్మహాముని యిట్లనియె. 106

మ. కలికీ! యత్తిలు నీవు వోవ, నెలుఁగుం గాఁబోలు నిప్పాటని
కర్కలరంభాతరువుల్ సుడింబడి నడింగంపించె జ్యోత్స్నలతల్

తలవాంచె న్నెఱిమోతజాతములు చింతంబల్లవశ్రేణి నొ
చ్చిలు నీహారము పేరనశ్రువులు రాల్చెం గంటివే కోమలీ! 107

వ. అనుచు నిట్టెలుంగునం జనకుండునుం గుమారియుం నొండొరుల నెడంబాయంజాలని వెనరునందనరుసల్లాపంబులం గాలయాపనంబు సేయుంజూచి శార్ఙ్గరవప్రముఖులగు శిష్యులు కాశ్యపులం గాంచి తత్త్వజ్ఞానసంపన్ను లగుమీర లిప్పిధంబున విపన్న భావంబునొందిన నియ్యిందుముఖి డెందంబున మఱియుం గుందుచున్న యదియదియునుంగాక ప్రయాణముహూర్తంబు సన్నిహితంబై యుండెం గావున ధైర్యం బవలంబించి యిక్కాంచనగాత్రికి హితంబుపదేశించి సత్వరంబుగాఁ బనుప నవధరించునది యని విన్నవించినం గొండొకసేదదేఱి యమ్మునికులశ్రేష్ఠుండు వనితాజనమూర్ధన్య యగుకన్య నీక్షించి యిట్లనియె. 108

మ. గురుశుశ్రూషలు సేయుమీ సవతులం గూర్మిన్ విలోకింపుమీ
పరివారమ్ములఁ బ్రోవుమీ సిరులగర్వస్ఫూర్తిఁ గైకోకుమీ
పురుషుం దూఱకుమీ సతుల్ నడచు నేర్పుల్ నీకు సూచించితిన్
దరుణీలోకమతల్లి చేకొనవె మాతల్లీ మదీయోక్తులన్. 109

వ. అని సముచితప్రకారంబునం గూఁతునకు హితోపదేశంబు చేసి మునుమునిం గ్రుచ్చి కౌఁగిటఁ జేర్చి మూర్ధాఘ్రాణంబాచరించి యథోచితంబుగా వీడుకొలిపి శార్ఙ్గరవప్రముఖుల సహాయంబుగాఁ బనిచి తానును గౌతమియుం గొండొకదవ్వనిసి ప్రఫుల్లహల్లకకహ్లారసముల్లసితసౌరభసమీరవిహారం బగునొక్కకాసారతీరంబున నిలిచినం గాంచి శకుంతలయును భరతుండునుం బునఃపునఃప్రణామంబు లాచరించి సంప్రీతు లగుజననీజనకులచేతం గ్రమ్మఱ ననుజ్ఞాతులై కతిపయప్రయాణంబులం జని చని గగనతలాలంకారాభరణంబు లగుప్రతప్తకార్తస్వరభాస్వరవరణంబులను, కనత్కనకఖచితకాశ్మీరపీఠరశ్మిచ్ఛటాసనాథంబు లగుసౌధంబులను, విద్రుమలతావితానమానిత జాలకంబు లగుగోపురాట్టాలకంబులను, మదకలస్తంబేరమగమనాగమనదుర్గంబు లగురాజమార్గంబులను, నానావిధభవ్యద్రవ్యసన్నివేశంబు లగువిపణిదేశంబులను, నయనాభిరామంబై యున్న యక్కరినగరంబుఁ బ్రవేశించి యరుగుచున్న యక్కాంచనగాత్రిం గాంచి యద్భుతరసావేశంబున నప్పురపురంధ్రీనికరంబు తమలోన. 110

సీ. నెలనాటిలేటిపిల్లలకుఁ జూడ్కు లుదిర్చు కలికిబిత్తరపుఁగన్నులబెడంగు
ననలెత్తుపవడంబునకుఁ గెంపు రచియించు తెలివమఱ్వంపువాతెఱ తెఱంగు
నిద్దంపుటద్దంపునివురుదీర్పఁగ నేర్చు కులుకుమిటారిచెక్కుల మెఱుంగు
నిసువురేకొనిమేనికిఁ గళల్ దులకించు లలనాలలామఫాలమ్ము సొబగు

తే. పసిఁడికినివన్నియలు వెట్టుభామ మేను, చదలునడుసత్త్వసంభూనుచానకొను
శ్రీకినవకంబు రాటించుచెలియవిను, లహహా జగదేకమోహానం బతివసొబగు. 111

వ. వెండియు. 112

సీ. నెఱనీటుగలవాఁడు విద్దంపుటద్దంపు డంబూనుగల్లద్వయంబువాఁడు
చూడఁజక్కనివాఁడు సురరాజకరరాజ కరిరాజకరమదోర్యుగంబువాఁడు
కలికిచూపులవాఁడు చెలువంపుబలు కెంపు లలినింపునఖపల్లవములవాఁడు
మొలకనవ్వులవాఁడు ముద్దుపెంపుసిరిపెంపు మురిపింపఁ గులుకునెమ్మోగమువాఁడు
తే. హాయలుంగలవాఁడు వెడలుపుటురమువాఁడు, సమధిగతచక్రవర్తిచిహ్నములవాఁడు
పావనిమారటదుష్యంతుఁడనఁగఁజాలు, బాలుఁడీబాలికామణిబాలుఁడెట్లొ. 113

శా. ఈలీలావతి దేహగాంగొనియెనుం డేఘన్యమూర్ధన్యుఁడో
రోలంబాలక బాలకుండు మునిపుత్రుల్ వెంటరా నొంటిరా
వైళంబె మొకా తల్లియొంటినకుఁ డివ్యమూర్తి కెవ్వారలో
వాలాయంబుగ వచ్చుచున్నయది యవ్వాల్గంటినిం గంటిరే. 114

మ. అనుచుం బౌరులు బారులై సిటి యయ్యబ్జాక్షి నీక్షింప న
వ్వనితారత్నము గాంచెఁ గాంచనమణిద్వారస్ఫురద్గోపుర
స్తనదంభీలగభీరభేరిపటహధ్వానప్రతిధ్వానద
ధ్ధనినాదంబగు రాజసౌధము నియద్విస్తారసంరోధమున్. 115

వ. ఇట్లువిధంబున శకుంతలరాజమందిరద్వారంబు సొచ్చి యచ్చోట విచిత్రరత్నప్రభారమ్యంబు లగుహర్మ్యంబులం గనుంగొనుచుఁ గక్ష్యాంతరంబులుగడచి యొక్కయెడ విరచితకాంచనపాంచాలికాసంచయోదంచితంబులును, ప్రకటముకురనికురుంబవిడంబితప్రతిబింబశోభాభిరామంబులును, గనత్కనకఖచితమణిప్రభాపటలజటిలంబులు నగువిచిత్రభిత్తిఫలకంబులవలనను సుసంభృతశాతకుంభస్తంభసంభావితవితానంబులవలనను నత్యంతరమణీయంబు నతివిశాలంబును నగుసభాభవనంబునందు వేదవేదాంగవిత్తము లగుభూసురోత్తములును, తర్కమీమాంసాదిశాస్త్రప్రసంగధోరణీపరిణతప్రశంసు లగువిద్వాంసులును, కావ్యనాటకాలంకారనైపుణీనిస్తంద్రు లగుకవీంద్రులును, భాగ్యోదయనిశాంతు లగుసామంతులును, నిజభుజార్గళాంతర్గళిత వైరిసముద్భటు లగువీరభటులును, మొదలగుననేకపరివారంబు పరివేష్టింపఁ గనకకంకణకింకిణీఘృణిక్రియాసంతులంబుగాఁ జంకజముఖు లిరుగెలంకుల వింజామరమ్ములు వీవ సమున్నతరత్నసింహాసనమ్మున నాసీనుండై యున్నయన్నరేంద్రునిం జూచి భయలజ్జాకలంకితస్వాంతయై యాత్మగతంబున. 116

ఉ. ఈమహనీయమూర్తిసభ కేగతిఁ జేరఁగవచ్చుఁ జేరి నే
నేమనిపల్కుదాన జనులెల్లను నవ్వఁగఁ బూర్వవృత్తమిా

ధీమణితో వచించుటకు దీమసమెయ్యది యెట్టులైననా
హా! మదిఁగట్టువాఁపడఁతులందొకదానిఁగ నన్ దలంపరే. 117

ఉ. ఇత్తఱిమాని యేకతమ యే విభుఁ జూడఁ దలంతునేని న
త్యుత్తమరత్నశోభితసమున్నతసౌధములన్వసించుమ
ద్వృత్తమెఱుంగఁజేయుటకు నేర నెఱుంగ నిఁకేమిసేయుదున్
గ్రొత్తలఁ జేరనిత్తురె సరోజముఖుల్ గలరెందఱేనియున్. 118

క. తనలోన నిత్తెఱంగున, వనిత వితర్కించి యిపుడ వసుధాధిపునె
మ్మనమునఁగల తెఱఁగెఱిఁగెద, నని క్రమ్మఱ నాత్మనిశ్చయముదళుకొత్తన్. 119

తే. మృదులపదలీలమదహంసిగదఁ బోవు, పాదపుదళుకొత్తమెల్లన నడుగులిడుచుఁ
జనవిభునిచెంతమణిమయస్తంభ మొకటి, తనకునఱచాటుగానిల్చెఁ దలిరుఁబోఁడి. 120

వ. అయ్యవసరంబున. 121

సీ. కనుదోయిగాదిది క్రమ్ముతుమ్మెదగఱుల్ దొరలకుండినతమ్మివిరులుగాని
మేనుగాదిదిమధుశ్రీనూనఁగోయిల డగరఁగానని మ్రానిచిగురుగాని
మోముగాదిదికళాధామమై యేనాఁడుఁ బామెఱుంగనిచందమామగాని
కెమ్మోవిగాదిదిపమ్మినరాచిల్క పిండుగానని దొండపండుగాని
తే. చెక్కులివిగావుసిద్ధంపుఁజికిలినొప్పి, తద్దయు నెసంగుమించుటద్దములుగాని
దివ్యమోహినియిటకునేతేఁనోపు, ననుచునీక్షించె నచటిసభ్యప్రజంబు. 122

క. అపుడొకపరి క్రేఁగంటన్, నృపమణి తనుఁజూచి చూడనివిధంబునఁ దా
విపరీతస్థితినుండినఁ, జపలేక్షణ డెందమందు సందియమందెన్. 123

వ. మఱియు స్వాత్మగతంబున. 124

తే. అకటకట! చూచిచూడనియటులుపేక్ష, చేయుచున్నాఁడెఱుంగకయో యెఱింగి
యో యెఱుంగనటంచులోనొదవుశంక, రాజబింబాస్య యమ్మహారాజుఁ జూచి. 125

మ. జగతీవల్లభ! నన్నెఱుంగవె? గజాశ్వస్యందనశ్రేణితో
మృగయాసంగతి నేఁగుదెంచి పృతనోర్మివ్రాతముండించి యొం
టిగఁ గణ్వాశ్రమభూమిఁజొచ్చి తమిఁజూడ్కింజేసి గాంధర్వమం
పుగవర్ణించుచునన్వరింపవె? నభోభూదేవతల్ సాక్షిగన్. 126

మ. అపుడేకా విలసత్కటాక్షలలితాస్యశ్రీవిలాసంబుతోఁ
గృపమీఱన్ ననుఁజూచి వేగఁ దగువారింబంతు నీవస్మదీ
యపురీరత్నవిచిత్రహర్మ్యముల నుద్యల్లీలఁ గ్రీడింప ర
మ్ము పయోజాక్షి! మదగ్రపత్నివగు సమ్మోదంబునం బల్కవే? 127

క. నేఁటికి నెవ్వరిఁ బనుపక, నాఁటివచోరచనమనసునాటకనన్నీ
చ్చోటనె నిలిపితి సుయశక, పాటవమున నెసఁగుభూమిపతి కిదితగునే. 128

ఘనతమైనట్టియాగములునూఱిటికంటె సుగుణాఢ్యుఁడగునొక్క సుతుఁడు మేలు
సుగుణాఢ్యులగునట్టిసుతులునూర్వురకంటె సనినొక్క సత్యభాషణము మేలు
తే. "నానృతాత్పాతకంపర"మనుచువినుచు, వేదవాదులవచనం బినవొమున్ను
వినియుమఱచితివో కాక వేడబమున, నేఁచఁదలఁచితివో ధారుణీశ! నన్ను. 137

ఆ. సత్య మశ్వమేధశతముఁ ద్రాసున బెట్టి, తూన్ప ముల్లుసూపెఁదుఱకు సత్య
మట్టిసత్యమునకు నఖిలవేదంబులు, సకలధర్మములును సాటిరావు. 138

క. కావున సత్యముగుఱిగా, భావింపుము యావరాజ్యపట్టస్ఫుట ల
క్ష్మీవిలసితుఁ గావింపుము, గావింపఁగధర్మపత్నిగా ననుఁగనుమీ, 139

క. మేనకకుం గౌశికునకు, నేనుదయించితి నిగర్వసింటఁ బెరిగితిన్
మానవనాయక! యనృతము, ఘానంబు ఘటింప నంతధర్మేతర నే. 140

వ. అని బహుప్రకారంబులం బ్రార్థించుచున్నమ్మంజుభాషిణిసంభాషణంబులుసత్యంబులనితోఁ
చియుండపురావిదులగుటసభాసదులెల్లఁ గుండదోఁచకమిన్నకుండిరి జనపతియమ్మానవతి
సంప్రార్థనంబుఁ బెడచెవులం బెట్టి వెండియు నిట్లనియె. 141

క. ఎక్కడిసుతు డెక్కడిసీ, వెక్కటి నేనన్నృతవాదమేటికిఁ గెక్కీ
చక్కఁదనంబున నుత్సము, నొక్కని నెదురొడ్డిపలుకు టుచితమె నీకున్. 142

వ. అనిన నద్దేవి నిట్టూర్పునిగిడించుచుం గొండొకదడపూరకుండి క్రోధారుణంబులగుకటా
క్షంబులనమ్మహిపతినెమ్మోముఁ జూచుచుంజూచుచు గాంధర్వవివాహంబునం బరిగ్రహిం
చునప్పటిపలుకు లుగ్గడించి కపటధార్మిక యప్పుడప్పాటనొప్పఁజెప్పియిప్పుడిప్పగిదిఁ
డప్పఁద్రోచిననానోఁచిననోముసఫలంబుగాఁగలదేనినీయడిగినసాక్షులు సాక్షాత్కరిం
పకున్నదురేయనియొలుఁగురాల్పడంబలికి యక్కలికికనుఁగొలంకులం జారుబాష్పంబుల
పూరంబుఁ గరతలంబులనొత్తికొనుచున్నపసన్నిధానంబుననిలువనుమరలిపోవనుందోప
కయాత్మగతంబునఁ గొండొకవితర్కించి లోకసాక్షియగుపుండరీకాక్షుండుదక్కం
దక్కొరుఁడొక్కఁడుఁ దీర్పంజాలరని తలంచి శ్రీహరినుద్దేశించి యిట్లని వినుతించె.

శా. శ్రీభూనీళలతోఁ బరాత్పరతరాజిల్లంజతుర్వ్యూహివై
శోభిల్లన్విభవావతారములమెచ్చుల్ గూర్పసర్వాంతరం
గాభోగంబువహింపఁబూజనలనుద్యన్మూర్తివర్తింపనీ
సౌభాగ్యంబుబుష్టాకభోగ్యతమమౌ సత్యంబు నారాయణా. 144

క. కరిణీనాథుని గాచిన, కరుణావరుణాలయుఁడవుగావున యుష్మ
చ్చరణారుణాంబురుహములు, శరణమువేఁడితిని సర్వసాక్షివధీశా. 145

శా. పుట్టంబుట్టఁగఁ దల్లిదండ్రులడవిన్ బోఁద్రోచిరీవైఖరిన్
బొట్టుంగట్టిన ప్రాణనాయకుఁడు పోపొమ్మంచు నోనాడెడిన్

గన్నా కోయిలపిల్ల చందమున బల్గాని నెవ్వఁ డంగొంటిన
నిట్లంగీకరింపఁ జూచెదవొ కుయ్యాలింపవే శ్రీహరీ. 146

సీ. పురుషుఁ డీఁడకమున్న పూపప్రాయపుదాని గానలోఁ ద్రోచిరి కన్నవారు
కోరి మాడినభర్త చేరుమింతనటంచు గొడఁగిపంచిరి మెచ్చుకొన్నవారు
నీవెడ నేనేడఁ బ్రవర్తనమటంచు మన్నింపరైరి చేలుకొన్నవారు
పాపపుణ్యము లేయుపటిఁ జెప్పఁగలేక మిన్నకుండిరి చుట్టమున్నవారు
తే. సాక్షిగా మిమ్ము రూపింప జననిభుండు, నట్టడవిలోన నన్నుఁ బ్రవృత్తసజలి
వెడలిపొమ్మనుచున్నాఁడు వేడబమున, నశరణశరణ్య యాలింపుమాధుకరయులు. 147

వ. అని యివ్విధంబునం బ్రార్థించు నమ్మించుఁబోడి యలమటఁ దీర్ప నలంచి 148

మ. ఫలదుండై తగు పార్వతీరమణుఁడు భాషావధూనాథుఁడున్
బలభిద్వహ్ని ముఖాఖిలామరవరుల్ పార్శ్వంబులం జుట్టిరా
లలదుత్తుంగపతంగరాజరథుఁడై లక్ష్మీసమేతం బగా
జలజాక్షుండు శకుంతలాపరదుఁడై సాక్షాత్కరించెన్ రహిన్. 149

వ. ఇత్తెఱంగున నమ్మత్తకాశినిసత్యంబునకుం బాతివ్రత్యంబునకు మెచ్చి యచ్చెరువాటున
వియచ్చరులు పొగడుకలకలం బాలించుచు నీశుండును వాగీశుండును లోనుగాఁగ
దివ్యపురుషులు సాంగసాయుధసపరివారంబుగా నలుగెలంకులం బలసి నిలువ శ్రీభూ
నీళాసమేతంబుగా గరుడవాహనారూఢుండై కిరీటకటకగ్రైవేయకేయూరకాంచీ
ముఖభూషణస్థగితమణికిరణప్రభాజాలంబు నలుగడలం గడలుకొన నద్దేవదేవుండు
సాక్షాత్కరించినం గాంచి సామంతమంత్రిపురోహితప్రముఖపరివారసహితంబుగా దిగ్గ
న లేచి సందప్రణామంబు లాచరించి ముకుళితకరకమలుండై యద్దేవుం బలుకనేరక
మిన్నకున్నం గని యాపన్నశరణ్యుం డగునప్పన్నగశయనుండు నరనాథుని ముఖంబునఁ
గరుణాంతరంగితంబు లగునిజకటాక్షవీక్షణంబు లాలయ మ్మ్రుదుమధురగంభీరస్వనంబున
ని ట్లనియె. 150

శా. సత్సంతానఫలామరద్రుమము సంసారక్రియాపుంజమా
పత్సంపత్సదృశావలంబనము సౌభాగ్యాలవాలమ్ము ని
త్యోత్సాహంబులపట్టుఁ గొమ్మ సుకృతోద్యోగానుసంధానమో
వత్సా! యిట్టిపతివ్రతాతిలకము న్వంచించెదే చేలవై. 151

ఆ. నీమనోరథంబు నెఱవేర్చి పిదప నీ, నేమమరయఁ గోరి కోమలాంగి
బాలుతోడ నిన్నుఁ బ్రాపింపవచ్చిన, నవగణింపఁదగునె యవనినాథ! 152

సీ. అభినవస్వర్గక్రియారంభమునను గ్రదీక్షఁ గానించు గాధిజుఁడు తండ్రి
లోకోపకారార్థమాకాశిరుపకవ స్థిరతిమాన్పు మేనకాదేవి తల్లి

సాహ్లాదుఁ గావింపవా! గుజ్జవై వెజ్జవై హజ్జనిమ్ముజగంబుజ్జగింపన్ బలిన్ వేఁడవా! జామ
దగ్న్యుండవై ఘోరధారాసముద్యత్కుఠారంబుచేఁ బూనిముయ్యేడుమాఱుల్ మహోగ్ర
ధుల్ ధారుణీనాథులం గూల్చుచున్ సాధులన్ వైభవామోదులం జేయవా! రామ
రూపంబునన్ భీమకోపంబునన్ లోకవిద్రావణున్ రావణున్ ధాటిచేఁ గీటణంగింతు
వంచున్, మహింగామపాలుండవై శ్యామచేలుండవై సామలోలుండవై భీమశీలుం
డవై శత్రుహాలాహలంబున్ లలింబూని పోరంబ్రలంబాదుఁ మేదినింగూల్తు
వంచున్, మరుత్వన్మఖప్రార్థనాబద్ధరోషంబునన్ బుద్ధవేషంబునన్ దానవస్త్రీనవా
మోదసంధాయివై దేవతాజీవితంబుల్ ధృతిం గాతువంచున్, గలిం గల్కిభావంబునన్
బల్ రవాల్గుఱ్ఱపున్నెట్టిరాహుత్తవై హత్తిదుర్వృత్తులామత్తులన్ గుత్తుకల్ గత్తినువ్వెత్తు
గన్ గోసి బాహాలసద్ఘోరణీధారుణిన్ బ్రోతువంచున్, బురాణంబులున్ శాస్త్రముల్
వేదముల్ వేదశీర్షంబులున్ బల్కునంచున్ మహాయోగివర్యుల్ రుచింపన్
వచింపన్ వినంగాంతు నబ్జోదరా సంవిదేకాంతమై యాద్యమై హృద్యమై భవ్యమై
దివ్యమై యోగమార్గమ్యమై సౌమ్యమై నిర్మలంబై నిరాకారమై సారమై శుద్ధమై
బుద్ధమై నిష్కలంబై జయంబై నిజంబౌ భవద్దివ్యతేజం బిళాపింగళామధ్యవీథిన్ నిరో
ధించి భావించి సేవించుధీరుల్ గదా నిత్యసూరుల్ సదానంద గోవింద మావిందవై
యిందిరాదేవితో నందిరాతీవితో నిందురా నెవ్వఁడుర్విం దిరంబై కడున్ సుందరంబ
య్యె మద్గోత్రమున్ బాత్రమయ్యెన్ సదాచారమున్ సంతతోగారమయ్యెన్
గృతార్థుండనైతిన్ ద్రయీతత్త్వపారాయణా యాదినారాయణా దేవ తుభ్యన్నమ
స్తే నమస్తే నమః. 157

వ. అని యనేకప్రకారంబుల వినుతించి వెండియు ని ట్లనియె. 158

శా. దేవా కాశ్యపు నాశ్రమంబునకు నర్థింబోవనీ లేమతో
దైవంబున్ బెరరేఁపఁగా నొదవె గాంధర్వక్రమోద్వాహమీ
భావంబన్యు లెఱుంగమిన్ వెఱచితిన్ బాలామణిన్ గైకొనన్
నావృత్తాంతము నీ వెఱుంగవఁటవె నాళీకపత్రేక్షణా! 159

ఉ. ఏనిక నేనికట్లభయమిచ్చితిరిచ్చలు నిచ్చలున్ బర
ధ్యానపరాయణుండనక తావక పాదసరోజయుగ్మమి
మ్మానినిసాక్షిగా నొడివి మత్సహచారిణి యయ్యె నయ్యెడన్
దీనశరణ్య మీర లరుదెంచుట చిత్రమె తత్రసాక్షివై. 160

క. మెచ్చితిరాత్మన్ సాక్షికి, వచ్చితిరిందుల జనాపవాదము దీఱన్
దెచ్చితిరి మాకువిశ్రుతి, నిచ్చితిరభయప్రదానమిమ్మానినికిన్. 161

వ. ఇత్తెఱంగున హరినుద్దేశించి పలుకుచు సగౌరవంబుగా శకుంతలం గదిసికొని శ్రీభూ
నీళాసహితుం డగుననద్దేవదేవునకుఁ బ్రదక్షిణనమస్కారంబు లాచరించి. 162

ఉ. దండము పార్వతీపతికిఁ దండము వాగ్రమణీవినోదికిన్
దండము వాసవాగ్నియమదానవముఖ్యదిగీశరాజికిన్
దండము నారదాదులకు దండము చారణసిద్ధకోటికిన్
దండమటంచు దేవియును దానును మ్రొక్కెను దేవతాళికిన్. 163

వ. ఇవ్విధంబున నవ్వధూవరులు హరిహరవిరించిబృందారకమునిబృందారకబృందంబుల కుంగ్రమంబున వందనంబు లాచరించి సవినయంబుగా భరతుని మ్రొక్కం బనిచిన నక్కుమారుండును విష్ణుదేవునకుం బ్రణమిల్లి పశుపతికిం బ్రణిపాతంబు గావించి చతురాననునకు దండప్రణామం బాచరించి యింద్రాది దిక్పాలురకుం జోహారు గావించి నారదాదిమహామునులకు నమస్కరించిన నద్దేవదేవుం డక్కుమారకంఠీరవు గాంభీర్యధైర్యౌదార్యాదివిశేషంబులకు మెచ్చి శకుంతలాదుష్యంతులం గాంచి యితండు వాజపేయాధ్వరశతంబుం గావించి యష్టాదశద్వీపంబులం దనశాసనంబు నిరర్గళంబుగా వర్తిలం జేయుచు వంశకర్తయై కీర్తిపౌరుషంబులు సంపాదింపంగలవాఁ డని యాదేశించి కరుణాతరంగితకటాక్షవీక్షణంబులం గృతార్థులం గావించి యంత నయ్యనంతుండు సపరివారంబుగా నంతర్ధానంబు చేసె నయ్యవసరంబున. 164

క. ఆడిరి రంభాదులు రహిఁ, బాడిరి గానం బునూనఫణితిన్ ఖచరుల్
వీడిరి ఖేదము పౌరులు, కూడిరి దుష్యంతుఁడును శకుంతలయు ధృతిన్. 165

వ. ఇవ్విధంబున దుష్యంతుండును శకుంతలాసమేతుఁడై కుమారునకు యౌవరాజ్యపట్టాభిషేకోత్సవంబు నిర్వర్తించి బ్రాహ్మణుల నానావిధమహార్హవస్త్రప్రదానంబులం దనిపి మహోన్నతవిభవంబున శకుంతలయుం దానును యథేష్టభోగంబులం దనరుచు రాజ్యంబు పాలించుచుండె నని వైశంపాయనుం డుజనమేజయునకుం జెప్పె వెండియు నిట్లనియె.

## ఫలశ్రుతి.

సీ. ధర్మార్థులకు భూరిధర్మప్రదం బగు నర్థార్థులకు నగు నర్థదంబు
కామార్థులకు భవ్యకామప్రదం బగు మోక్షార్థులకు నగు మోక్షదంబు
పరిణయార్థులకును బరిణయప్రద మగుఁ బుత్రార్థులకు నగుఁ బుత్రదంబు
సంపదర్థులకును సంపత్ప్రదం బగు విజయార్థులకు నగు విజయకరము
తే. వేడ్కఁ జదివిన వ్రాసిన వినినయట్టి, ఘనుల కఖిలార్థలాభంబు గలుగుచుండు
నవనినాచంద్రతారార్కమలఘులీలఁ, బరిఢవిల్లు శకుంతలాపరిణయంబు. 167

తే. అని శకుంతలాకల్యాణ మనువుమీఱ, మౌనినాథుండు చెప్పిన మనుజవిభుఁడు
వీనులారంగ వినుచుండి విస్మయమునఁ, బొంగి సంతోషభరితాంతరంగుఁ డయ్యె. 168

## ఆశ్వాసాంతము

చ. హరిహరినాగనాగపశతారకతారకతారతారకా
శరశరదిందుకుందహరిచందనచందనభారభారతీ

వరవరవాజివాజిరథవాసభాసాసమృణాళనాళవి
స్తరతరకీర్తికీర్తితసదానసదానవేంకటేశ్వరా. 169

భుజంగప్రయాతము.

కృపాధారదానేరకృష్ణార్తిదూరా, విపశ్చిజ్జనారాధ్యవేదాంతబోధ్యా
కపాలిస్తుతస్థేమకల్యాణధామా, రిపుధ్వాంతఘుస్రేశశ్రీవేంకటేశా. 170

గద్య. ఇది శ్రీమత్కౌసల్యానందనప్రసాదసమాసాదితకవితావిచిత్ర మైత్రేయసగోత్ర నృసింహగురుపుత్త్ర కృష్ణకవిప్రణీతం బైనశకుంతలాపరిణయం బనుమహాప్రబంధంబునందు శకుంతలాదుష్యంతసంవాదంబును శ్రీవిష్ణుసాక్షాత్కారంబును శ్రీవిష్ణుసంకీర్తనంబును భరతయౌవరాజ్యపట్టాభిషేకంబును శకుంతలాదుష్యంతపునస్సభోగోపాఖ్యానంబు ననుకథలంగలసర్వంబును దృతీయాశ్వాసము.

శకుంతలాపరిణయము

సమాప్తము.

---

చెన్నపురి: 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1927.

# ఆంధ్రగ్రంథములు.

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| అచ్చతెనుగురామాయణము, శుద్ధప్రతి | ... | 1 | 4 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 10 |
| అడవిమల్లెలు, ఎనమండ్రనారాయణమూర్తి | ... | 0 | 8 |
| అధ్యాత్మరామాయణము, క్రొత్తకూర్పు | ... | 1 | 8 |
| అనంతునిఛందము, ఛందోదర్పణము | ... | 0 | 14 |
| అనిరుద్ధచరిత్రము, కనుపర్తి అబ్బయామాత్యప్రణీతము | ... | 0 | 8 |
| డిటో కాలికోబైండు | ... | 0 | 14 |
| అప్పకవీయము, శ్రీగిడుగురామమూర్తి పంతులుగారి విమర్శతో నున్నది. | | 2 | 8 |
| అంబరీషోపాఖ్యానము, సటీక (భాగవతము) | ... | 0 | 4 |
| ఆముక్తమాల్యద, వావిళ్ల. రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానముతో మేలు కాకితములమీఁద చక్కఁగ మరల ముద్రించియున్నారము | ... | 3 | 8 |
| ఆంజనేయదండకము, హనుమద్దండకము | ... | 0 | 2 |
| ఆంధ్రభాగవతము, పోతనామాత్యప్రణీతము, ఇదివఱకు ముద్రితమైనప్రతుల కన్న అన్నివిధముల బాగుగనున్నది | ... | 5 | 0 |
| డిటో అత్యుత్తమప్రతి, రెండుసంపుటములు | ... | 7 | 8 |
| డిటో 3 సంపుటములు | ... | 9 | 0 |

శ్రీమదాంధ్రభారతము-పద్యకావ్యము:—

అనేకవ్రాతప్రతుల సహాయమున చిరకాలమునుండి సంపూర్ణ పరిశ్రమముతోఁ బరిష్కరింపఁబడినది. మేలుకాగితములపై స్ఫుటముగ అచ్చొత్తించి మంచికాలికోబైండు చేయఁబడియున్నది.

| | | | |
|---|---|---|---|
| 7 సంపుటముల ప్రతి | ... | 14 | 0 |
| 3 సంపుటముల ప్రతి | ... | 13 | 0 |
| ఆది, సభాపర్వములుగల సంపుటము | ... | 2 | 0 |
| ఆరణ్యపర్వము ,, | ... | 2 | 0 |
| విరాటోద్యోగపర్వములు ,, | ... | 2 | 0 |
| భీష్మద్రోణపర్వములు ,, | ... | 2 | 0 |
| కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు ,, | ... | 2 | 0 |
| శాంతిపర్వము | ... | 2 | 0 |
| అనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణపర్వములుగల సంపుటము | ... | 2 | 0 |
| ఆదిపంచకము, ఒకటేసంపుటము | ... | 5 | 8 |
| యుద్ధపంచకము ,, | ... | 3 | 12 |
| శాంతిసప్తకము ,, | ... | 3 | 12 |